# ప్రగతిపథంలో భారత స్త్రీలు

డా॥ వి. కోటీశ్వరమ్మ M.A., B.Ed., Ph D.
ప్రిన్సిపాల్ & కరస్పాండెంట్
చిల్డ్రిన్స్ మాంటిస్సోరి స్కూలు
మాంటిస్సోరి మహిళా కళాశాల
విజయవాడ.

పబ్లిషర్స్:
భవానీ పబ్లికేషన్స్
విజయవాడ.

బాలికలు, స్త్రీలు గతంలో తమ ఉజ్జ్వల స్థానాన్ని పరిశీలించిన తరువాత క్రమంగా పందొమ్మిదో శతాబ్దాంతానికి తెర మరుగయి పోయా రన్న విషయాన్ని గమనించారు. క్రమంగా ఆధునిక యుగంలో వారి పున రుజ్జీవనం ఆరంభమయింది. వారి కడ్డుగోడలుగా నిలచిన బంధాలు క్రమంగా సడలిపోయాయి.

స్వాతంత్ర్యానంతరం మహిళా వికాసానికి ప్రత్యేక ప్రణాళికలు రూపొందించబడ్డాయి. తత్ఫలితంగా ఈనాడు దేశంలో అన్ని రంగాల్లోను మహిళలు ఎంతో ముందుకు వచ్చారు. చట్టంద్వారా లభించిన హక్కులు ప్రభుత్వం సమకూర్చిన అవకాశాలను ఉపయోగించుకోవడంతోపాటు వారి లోనే ఒక వినూత్నమయిన ఉత్సాహం, కార్యదీక్ష బయలుదేరి ఎందరో మహిళామణులు దేశానికి వివిధ రంగాల్లో సేవలుచేస్తూ వున్నారు.

"ప్రగతి పథంలో భారత స్త్రీలు" అనే ఈ చిన్న సమీక్షలో ఏ ఏ రంగాల్లో ఎంతమంది స్త్రీలు ఎలాంటి ఉన్నత స్థానాలనధిగమించింది తెలియ జేయడమయింది. అనేక రంగాల్లో అత్యున్నత స్థానాల నలంకరించిన నారీ రత్నాలను పేర్కొనడంలో ఉద్దేశం, విద్యార్థినులలో తాముకూడ తమకు ప్రత్యేకాభిరుచి, ఆసక్తి ఉన్న రంగంలో ప్రత్యేక కృషిని పట్టుదలతో చేసి ఆ సంఖ్యను అనేకరెట్లు పెంపొందిస్తారనే ఆకాంక్ష, ఆసక్తేనని చెప్పాలి. ఆ విశ్వాసమే నన్నీ పనికి పురికొల్పింది. అందులో ఏ కొంతమేరకు జరిగినా నా ఆశయం సిద్ధిస్తుందని ఆశిస్తూ-

ఇట్లు

ఏ. కోటీశ్వరమ్మ, M.A., B.Ed., Ph.D.,
ప్రిన్సిపాల్ & కరస్పాండెంటు,
చిల్డ్రెన్స్ మాంటిసోరి స్కూలు,
మాంటిసోరి మహిళా కళాశాల.

విజయవాడ,
14-10-80.

Dr. B. GOPAL REDDY,

Phone : 4
Sudarshan Mahal,
Nellore-3.

"ప్రగతి పథంలో భారత స్త్రీలు" is very interesting and gave good many facts.

The book is very interesting and give us a lot of information.

(Sd) B. GOPAL REDDY,
Chairman,
Sahitya Academy,
Hyderabad.

# అభిప్రాయం

"నస్త్రీ స్వాతంత్ర్య మర్హతే" అన్న మనుభాషితంనుంచి భారత దేశం చాలా ముందుకుపోయింది.

"ఏ జాతి సగం బానిసగా, సగం స్వతంత్రంగా మనలేదు" అన్న అబ్రహాం లింకన్ సూక్తిని గాంధీజీ భారత స్వాతంత్ర్యోద్యమానికి అన్వయింప జేశారు. స్త్రీలు పాల్గొననిదే భారత దేశానికి స్వాతంత్ర్యం రాదని, వచ్చినా అది అసమగ్రంగానే వుండిపోగలదని ఆయన భావించారు. అందువల్లనే భారత స్వాతంత్ర్యోద్యమంలో మహిళలు విశేషంగా పాల్గొన్నారు. పురుషులతోపాటు వారుకూడా జైళ్ళకు వెళ్ళారు.

స్వతంత్ర భారత రాజ్యాంగానికి స్త్రీ పురుషులకు సమానావకాశాలు, సమానమైన హక్కులు ఇవ్వబడ్డాయి. మహిళలు రాయబారులుగా, మంత్రులుగా, వివిధ పదవులను అలంకరిస్తున్నారు. తుదకు "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతే" అన్న దేశానికి ఒక మహిళ ప్రధాని అయింది.

నేడు వివిధ రంగాల్లో స్త్రీలు పురోగమిస్తున్నారు. అయితే, మహిళా మహోదయం ఇంకా పూర్తికాలేదు. ఈ సందర్భంలో ఇంకా ఎంతో జరగవలసి వుంది.

భారతీయ మహిళాలోకం ఏ మేరకు ఏయే రంగాలలో పురోగమించిందీ సవివరంగా ఈ పుస్తకంలో డా॥ వి. కోటీశ్వరమ్మగారు వ్రాశారు. ఈవిషయంపై సాధికారంగా వ్రాయగల శ్రీమతి కోటీశ్వరమ్మగారు రచించిన ఈ పుస్తకం భారతీయ మహిళాలోకం స్థితిగతులను చక్కగా వివరిస్తున్నారు. దీన్ని చదవడంవల్ల తాము ఎక్కడవున్నదీ మహిళలు తెలుసుకోగలుగుతారు. ఇది వారికి ఉత్తేజం కలిగిస్తుంది. ప్రగతి పథంలో తాము ఇంకా పురోగమించాలన్న పట్టుదలను వారిలో ప్రేరేపిస్తుంది.

అత్యంత ఉపయోగకరమైన ఈ పుస్తకాన్ని రచించిన డా॥ శ్రీమతి కోటీశ్వరమ్మగారు మహిళాలోకం కృతజ్ఞతలకు, మొత్తంమీద పాఠకుల అభినందనలకు పాత్రురాలు.

ఇట్లు,

**తుర్లపాటి కుటుంబరావు,**
గవర్నర్, అంతర్జాతీయ తెలుగు సంస్థ.
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం)

విజయవాడ,
22-9-80.

# ప్రగతిపథంలో భారతస్త్రీలు

స్త్రీల గమ్యానికి ప్రాతినిధ్యం వహించడానికి ముచ్చటగా మూడు లక్ష్యాలమీద కేంద్రీకరిస్తూ 1975లో ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ మహిళా సంవత్సరాన్ని ప్రకటించింది. ఆ లక్ష్యాలు :-

1. పురుషులతో సమానహక్కులు సాధించడం

2. స్త్రీ పురుషులు సమైక్యంగా పనిచేయడం

3. సుస్థిరశాంతిని నెలకొల్పడంలో సంపూర్ణ సహకారాన్నియడం.

మొదటి రెండు లక్ష్యాలు కృషికి సంబంధించినవికాగా మొత్తం మూడు కలిసి స్త్రీ స్థాయికి సంబంధించినవి అవుతాయి. ఈనాడు యే యే దేశాలలో స్త్రీల స్థితిగతులెలావున్నాయో మొట్టమొదట తెలుసుకోడానికి వానిని పరిశీలించి పరిశోధించాలి. వారి ఉద్యోగ పరిస్థితులు జీవన స్థాయిలను బాగా అధ్యయనం చేయాలి. ఈ విషయాన్నిగురించి ఐక్యరాజ్యసమితి మానవహక్కుల విభాగాధిపతి, "ఈ సమస్య అభివృద్ధి చెందిన దేశాలకు, అభివృద్ధి చెందని దేశాలకు సమానంగా వర్తిస్తుంది" అని అన్నారు. ఏది ఏమైనా అమలుపరచడం మానవ సమాజంలోని సంస్కృతమయిన అంతరాలనుబట్టి వుంటుంది. భారతంలో పని ప్రత్యేకత దాని స్వభావం, విలువలనుబట్టి వుంటుంది.

ముఖ్యంగా కాయకష్టంతోకూడిన పనిని ఈ దేశంలో కొంచెం అధమ స్థాయికి చెందిన పనిగా భావిస్తున్నారు. హిందూ సమాజంలో ఈ కాయ

కష్టంతోకూడిన పనిని అనాదినుంచి కొన్నికులాలకు కేటాయిస్తున్నారు. అగ్రకులాలవారిస్థాయి వారి ఆదేశాలను ఇతరులు అనుసరించేటట్లు చేయ గల వారి సమర్థతనుబట్టి వుంటుంది. అందువల్ల వారు నిరంతరం తమ దృష్టిని అధికారం చెలాయించడంలోనే కేంద్రీకరించి తన్మూలంగా గౌరవ ప్రతిష్టలున్నాయని ప్రదర్శించుకుంటారు. అభివృద్ధి సాధించిన ఆధునిక యుగంలో ప్రజాస్వామ్యయుతమైన రాజకీయ జీవనాన్ని సాధించినప్పటికీ న్యాయశాస్త్రంలో నూతన రాజ్యాంగబద్ధమయిన సర్వ సమానత్వం ఆవిర్భ వించినప్పటికీ సమాజంలో వ్యక్తులస్థాయి ఇతరులపై అధికారం చలా యించడంమీద ఆధారపడివుండటం గమనార్హం. అందువల్లనే పరిపాలనా రంగంలో ఉద్యోగాలకోసం అనేకమంది ప్రయత్నించడం, తక్కినవారిలో కూడ అత్యధికులు రాజకీయాలను వృత్తిగా స్వీకరించడం సామాన్యంగా కనబడుతోంది. కాయకష్టం అధమస్థాయికి చెందిందని భావించడం సర్వ సామాన్యమయిపోయింది. క్రిందిస్థాయివారు ఆర్థికంగా అభివృద్ధి సాధించి పై స్థాయికి చేరుకొన్నప్పుడు వారిలో సర్వసామాన్యమయిన మార్పు ఒకటి కనబడుతుంది. వారు వారి భార్యలను అంతవరకు చేస్తున్న కాయకష్టపు పనికి పంపడం మానుకోవడమే ఆ మార్పు. స్త్రీలందరు ఈ మార్పువుందని అంగీకరిస్తారు. కాయకష్టపుపని మానివేయడమే తమ స్థాయి పెరిగిందన డానికి చిహ్నమని వారు భావిస్తారు. ఈ మధ్య ఢిల్లీ నగరంలో కొత్తగా సిరిసంపదలుగలిగిన ఒక కుటుంబంలోని పది సంవత్సరాల బాలిక పొరు గింటిబాలిక ఒక మొక్కను నాటుతూవుండడం చూచి, 'మీకు పని మను ష్యులు లేరా?' అని అడిగిందట. ఆర్థికంగా క్రిందస్థాయిలోవున్న కుటుంబా లలో స్త్రీలు కూడ పనిచేయవలసి వుంటుంది. భార్యాభర్తలు రోడ్ల ప్రక్కన కలిసి పండ్లు, కూరగాయలు, తినుబండారాలు అమ్ముకోవడం సర్వ సామాన్యంకదా! పసిబిడ్డలను వళ్ళో వుంచుకుని, మూపున గట్టుకుని స్త్రీలు

పనిచేయడం సర్వత్రా కనబడుతున్న విషయమేగదా! భవన నిర్మాణాలలో అలా కనబడడం సర్వసాధారణం. నూతనంగా ధనికవర్గ మేర్పడడంతో వారి డాబు దర్పాలు మధ్యతరగతి ప్రజలను కొంత బాధించడంతోపాటు ధరల పెరుగుదలకూడ కొంత మార్పుతెచ్చాయి. వీరు గతంలో కాయకష్టం చేసినవారుకారు. దానితో మధ్యతరగతి దెబ్బతినిపోయింది. తమ స్త్రీలు కాయకష్టానికి వెళ్ళడం గౌరవభంగమని భావిస్తారు పురుషులు. కాని క్రమంగా ఈనాడాభావం కూడ మరుగయిపోయింది. అనేకమంది స్త్రీలు ఉద్యోగాన్వేషణలో ఉండడం సర్వవిదితం. ఒకవంక గౌరవహీనమేమో అని బాధపడుతున్నా పరిస్థితుల ప్రభావానికి తలవొగ్గి ప్రయత్నిస్తున్నారు. ఉద్యోగులు తక్కిన వారికంటే అధికులన్నభావంకూడ ఈ మార్పుకు కారణంగా కనబడుతుంది. కాని ఉన్నత ఉద్యోగాల కవసరమయిన ఉన్నతవిద్య పొందగల వారెంతమంది? పాశ్చాత్య కుటుంబాల స్థాయిలో ఉన్నవారికి సాంకేతిక ఉద్యోగాలలో ఉన్న కుటుంబాలవారికి, నగరవాసులకు ఉన్నత విద్య బడయడం సుసాధ్యం. మధ్యతరగతి కుటుంబాలకు ఈ సౌకర్య మింకా అరుదుగానే ఉందని చెప్పాలి. మొదట చెప్పిన కుటుంబాలలో స్త్రీలు మాత్రం కోరి ఉద్యోగం చేస్తారు

పని చేయడానికి స్త్రీలుకూడ పురుషులతోపాటు అర్హులే. హక్కుదారులే. ప్రస్తుత పరిస్థితుల్లో వ్యవసాయ కూలి కుటుంబాల్లోను, కిందితరగతి ప్రజల్లోను స్త్రీలు అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు కాయకష్టం చేస్తున్నారు. చేశారు. చేస్తారు. దీనికొక స్థాయిలేదు, గుర్తింపులేదు. విద్యావంతులు, మేధావులయిన స్త్రీలు తమ శక్తిసామర్థ్యాల నుపయోగించుకోవాలని భావిస్తారు. అందువల్లనే ఉద్యోగాలను స్వీకరిస్తారు. దానినాటంక పరిచేవి భారత న్యాయశాస్త్రంలో లేదు సరికదా వారి జీవన విధానంలోకూడ లేదు. అందు వల్ల ఉద్యోగమనే సమస్య మధ్యతరగతిలోను, నగరప్రాంతంలోను కన్ప

తత్వాన్ని జీర్ణించుకొన్న కుటుంబాల్లో పల్లెపట్టునఉన్న భూస్వామ్య కుటుంబాల్లో, వర్తక వ్యాపారాలల్లో కనబడుతుంది.

క్రింది స్థాయిలో సమానమయిన పనికి స్త్రీ పురుషులిద్దరికి సమాన వేతనాన్నీయడంలేదు. సమానమయినపనికి సమాన వేతనమన్నభావం అభివృద్ధిచెందిన దేశాలలో సర్వసామాన్యమయిపోయింది. ఇలా కాయకష్టం చేసేవారు భారతదేశజనాభాలో 25 సంవత్సరాల లోపు వారిలో 58 శాతం ఉన్నారు. అందువల్ల పురుషులకు పనిలేనపుడు అంతకంటే తక్కువరేటుకు వస్తేనేతప్ప సాధారణంగా స్త్రీలను నియమించరు. అందువల్ల చట్టంవల్ల పరిస్థితులను మెరుగుపరచడానికి ప్రయత్నించడం కేవలం అలాఉన్న పరిస్థితులనుకూడ ప్రోత్సాహించడమవుతుంది. మనకున్న మానవశక్తినిమించి ఉద్యోగాలుంటేగాని అల్లాంటి సాంఘికన్యాయం సక్రమంగా పనిచేయలేదు. అందువల్ల ప్రస్తుతం మనం గమనింపవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి.

1. కింది తరగతి స్త్రీలకు పని కల్పించడం

2. సాంకేతిక విద్యలో స్త్రీ పురుషులకు సమానావకాశాలను కల్పించడం.

ఈ రంగంలో ప్రస్తుతం పురుషులకే అవకాశాలెక్కువ. కారణం వారికున్న ఉన్నత విద్యార్హతలే. దీనిని తొలగించాలంటే సాంకేతికవిద్యలో స్త్రీలకు పురుషులతో సమానంగా ప్రవేశమీయాలి. అప్పుడుగాని స్త్రీలకు శిక్షణపొందె అవకాశంరాదు. అర్హత కలుగదు. ఆ శిక్షణ లేకపోవడం వల్లనే ఆయారంగాల్లో ఆధునిక యంత్రాలతో పనిచేయడానికి అవసరమయిన అర్హతలు లేవని వారిని వెల్లగొడుతున్నారు. వివిధ పారిశ్రామిక సంస్థలల్లో, మేనేజరునుంచి కార్మికస్థాయివరకు స్త్రీలను నియమించడానికి యజమానులు సుముఖంగా ఉన్నట్లు కనబడుతున్నారు. దానికి కారణం స్త్రీలు కష్టించి పని

చేయడం, చురుకుగా పనిచేయడమే. అంతేకాక స్త్రీలు ఉద్యమాలను లేవదీయరు. పురుషులు కార్మికసంఘాలలో చేరి ఉద్యమాలలో పాల్గొనడం సర్వసామాన్యం. అంతమాత్రాన భారత స్త్రీలు కార్మికసంఘాలలో లేరని కాదు. మణిబెన్ కారా సుప్రసిద్ధ కార్మికనాయకురాలు. గత నలభయి సంవత్సరాలనుంచి కార్మికలోకానికి సుపరిచితురాలయిన పార్వతీకృష్ణన్ కూడ సుప్రసిద్ధ కార్మిక నాయకురాలేకదా! అనసూయాబెన్ సారాబాయి మరొక ప్రముఖ కార్మిక నాయకురాలు. ఆమె తన సొంత సోదరుని కెదురునిలిచి పోరాడింది. ఆయన అలహాబాదు నగరంలో సుప్రసిద్ధ పారిశ్రామికవేత్త. ఇలాబెన్ భట్ చిన్నచిన్న పరిశ్రమలలోని కార్మిక స్త్రీలను సంఘటిత పరచడంలో ఖ్యాతి వహించింది. అధమ స్థాయిలోఉన్న స్త్రీల పరిస్థితి మెరుగు పరచాలని చేసిన ప్రయత్నం కష్టతరమయిపోయింది. సాహసంతోకూడిన పనయింది. కేవలం రాజకీయ జీవితపు పైమెట్లను అధిరోహించడానికి మాత్రమే పురుషులు కార్మికరంగంలో పనిజేస్తారు. కాని స్త్రీలు అలాకాదు. వారు నిజంగా కార్మికులకొరకు పని చేస్తారు. పరిశీలనలోకూడ ఆ విషయం స్పష్టమైంది.

ఓట్లు వేయడంలో స్త్రీలు ప్రసిద్ధులన్నవిషయం సర్వజనామోదకరం గదా! స్త్రీలు ఉద్యోగాలు, వృత్తులమీద ఉత్సుకత చూపినా రాజకీయాలలో తప్ప కుటుంబాలలో, ఇతరచోట్ల అలాంటివారిని పాశ్చాత్యులను అనుసరిస్తున్నారన్న ముద్రవేయడంవల్ల ఆ ఉత్సుకతకూడ నశిస్తుంది. గాంధీజీ శిష్యురాళ్ళు స్వహస్తాలతో వడికితీసిన నూలుతోతయారయిన చీరలుధరించి ఎలాంటి అలంకరణలులేక నగలు, నాణ్యాలను విసర్జించి అతి నిరాడంబరంగా ఉండేవారు. వారి జీవనమార్గం సంఘసేవ. ప్రతివారు అలాంటి జీవన మార్గాన్ని ఆదర్శ జీవనంగా స్వీకరిస్తున్నామని చెప్పడం మామూలయిపోయింది. వృత్తులు స్వీకరించడంలో అనేకమంది విజయం పొందినవారు

ఉన్నారు. ఫిల్ము తారలదగ్గరనుంచి అధునాతన స్త్రీలవరకు పరిసరాల వత్తిళ్ళను కూడ లెక్కచేయక తమతమ వృత్తులను యదేచ్ఛతో సాగిస్తూ వున్నారు. గ్రామీణ నిరాడంబరత క్రమంగా మటుమాయమై పోతూఉన్నది. భారతదేశం ఏకకాలంలో ద్వివిధంగా కనబడుతోంది. కిందినుంచీ పైవరకు అన్ని స్థాయిలలోను పైపైకి వెళ్ళాలని ప్రయత్నం చేయడం సామాన్యమై పోయింది. దేశీయులనేకమంది చైతన్యవంతులయిన మేధావుల పరిధి నుంచి దూరమయ్యారు. ఆ దూరంగా వున్నవారందరు స్త్రీలమీద అధిక భారాన్ని మోపినవారవుతున్నారు.

గ్రామీణ ప్రాంతాలలోని స్త్రీలస్థాయిని అభివృద్ధిపరచాలి, అంతవరకు కూడ వారి స్థాయిలో చెప్పుకోతగిన అభివృద్ధిరాదు. అలా చేయాలన్న వారి విద్యాస్థాయి పెంచాలి. మానవ శ్రమ శక్తిలో స్త్రీ భాగస్వామి కావాలంటే ఇంటా బయటా ఆమె చేసేపనులనేకాలలో ఏదోఒకరీతిని నైపుణ్యాన్ని పెంచుకోగలగాలి. విద్యాస్థాయి పెరిగిననాడుగాని ఆయా శిక్షణలు పొందే అవకాశంగాని, ఉద్యోగావకాశంగాని లభించవు. ఏమయినా దేశ ఆర్ధిక వ్యవస్థలో మార్పు వచ్చినపుడుగాని గ్రామీణప్రాంతాల మేధాశక్తి పెరిగే అవకాశం రాదు. అప్పుడుగాని స్త్రీలు పనిచేసే పరిధి విస్తృతం కాలేదు.

ఈ మార్పు గ్రామీణ ప్రాంతాలనుంచీ పట్టణాలకు వలస వెళ్ళడాన్ని మరింతగా పెంచుతుంది. పరిశ్రమలు, వ్యవసాయంమధ్య తీవ్రమయిన మార్పునుకూడగొనివస్తుంది. రానురాను గ్రామాలు పట్టణాలయిపోతున్నాయి ఆంగ్లేయుల వలస విధానంలోని ఆచారాలను అనుసరించడంవల్ల పరిపాలనకు ఉపయోగకరమయిన శక్తిని దేశభక్తితో సమన్వయపరచి సమైక్యంగా కృషిచేయడం కనబడుతుంది.

పరిశ్రమలను పెంపొందించడంతోపాటు ఉత్పత్తిని ఉపయోగించుకో గలిగిన కొనుగోలు శక్తి కూడ ప్రజలకున్నపుడు మాత్రమే పారిశ్రామికీకరణ సక్రమంగా జరుగుతుంది. అందువల్ల సామ్రాజ్యంలేని పేదవ్యవసాయ దేశం మార్కెట్టు లేని దేశంలో స్థిరమయిన ఆర్థికస్థితి గలిగిన దేశాలతో పోటీపడి నిలబడటం కష్టతరమయిన విషయం. అభివృద్ధిచెందిన దేశాలు, అభివృద్ధిలో వెనుకబడ్డదేశాలు గణనీయమైన అభివృద్ధిని సాధించడానికేమాత్రం అంగీక రించవు. అందువల్ల వారి లాభాలు అరికట్టబడతాయని ఆదేశాలు భావి స్తాయి. UNCTAD విధానాలు, ఐక్యరాజ్యసమితి విధానాలుకూడ ఈ విషయాలనే స్పష్టపరుస్తాయి. ఈ శతాబ్దారంభంలో అనేక దేశాలను జాతులను శక్తివంతంగాచేసిన పారిశ్రామిక విప్లవం భూగర్భంలోని ఖనిజ సంపదను క్రమంగా ఉపయోగించుకోనారంభించింది. ఇప్పటికి చాలవరకు ఉపయోగించిందికూడ. ప్రస్తుత పరిశ్రమలకు ముఖ్యంగా కావలిసిన అనేక ఖనిజాలు, ఇతర పదార్థాలు సంపూర్ణంగా ఉపయోగించిన తరువాత ఉత్పన్నమయ్యే సమస్యలెలా వుంటాయి? ఈ ప్రశ్న అందరి దృష్టికి వచ్చే ప్రశ్న. దానితో పారిశ్రామికరంగం అంతరించిపోవాలి. ఇది ఒక నగ్న సత్యాన్ని చూపుతుంది. భారతదేశంవంటి పెద్దదేశం, మహత్తరమయిన మానవశక్తి ఉన్న దేశం, సూర్యచంద్రులతోపాటు సహజమయిన వనరు లున్నదేశం, భవిష్యత్తులో సంపదగలదేశం కాగలుగుతుంది. తన ప్రత్యేక స్థానాన్ని నిలుపుకోగలుగుతుకది. అయితే ఆ పరిస్థితి ఒక ప్రత్యేక షరతు మీద మాత్రమే జరుగుతుంది. ఆ షరతును అనుసరించి ఆభారతం వ్యవ సాయక దేశంగా మారి సూర్యచంద్రులను ప్రకృతిలోని సకలసంపదలను సంపూర్ణంగా వినియోగించుకోగల శక్తిని సమకూర్చుకోగలిగినపుడు మాత్రమే జరిగే విషయం.

ఈ మార్పు వైపున సర్వశక్తులు కేంద్రీకరిస్తే భారతదేశ స్వరూపమే మారిపోతుంది. ఇప్పటికే ఆధునిక సాంకేతిక శాస్త్రంతోకలిసి అణుశక్తిని అభివృద్ధిపరచి గ్రామీణ ప్రాంతాలకు ప్రసరింపజేసే టి. వి. సాటలైటు. విద్యా విషయక కార్యక్రమాలు, ఎలక్ట్రానిక్సు వార్తా ప్రసరణం కంప్యూటరు విధానంతో అమలులోకి వస్తోంది. దీనివల్ల గ్రామీణ ప్రాంతాలను పట్టణప్రాంతాలతో కలిపివేయగలగాలి. సమాంతరంగా సాగిపోయే. ఆ రెండింటిని కలపడానికి మనం ప్రయత్నం చేయాలి.

ఈ సందర్భంలో పట్టణ ప్రాంతాల స్త్రీల అభివృద్ధికి ద్వితీయస్థానాన్ని ఇవ్వాలి. గ్రామీణ ప్రాంతాలమీద శ్రద్ధను అధికంగా చూపిన పట్టణ ప్రాంతాల అభివృద్ధి గ్రామలలోకి తీసుకునిరావచ్చు.

ఈ సందర్భంలో భారతదేశంలో యే యేస్త్రీలు యే యే రంగాలలో శాఖలలో యే యే పనులు నిర్వహించారో నిర్వహిస్తున్నారో పరిశీలించి తెలిసికోవడం ఆవశ్యకం.

న్యాయవాద వృత్తిలో 1882 నుంచీ స్త్రీలు ప్రముఖస్థానం ఆక్రమించారు. నాటినుంచి నేటివరకు న్యాయవాదులుగా, బారిష్టరులుగా, సుప్రీం కోర్టులో న్యాయవాదులుగా, సెషన్సుజడ్జీలుగా స్త్రీలుండడం కనబడుతోంది. అయినా దేశమంతటిలో హైకోర్టు ఛీఫ్ జస్టిస్‌లుగా మాత్రం ఒకే స్త్రీ కనబడుతుంది. కేరళలోని అన్నాచండీ ఆమె. దేశంలో ఆ పదవిని నిర్వహించిన ప్రప్రథమ మహిళ. ప్రభుత్వంలో క్రమబద్ధమైన రంగాలలో పని చేసే స్త్రీలు 47.2 శాతం ఉన్నారు. ప్రయివేటు రంగంలో 65 శాతం నుంచి 52.8 శాతానికి పడిపోయింది. ఉద్యోగాలుచేసే పురుషులతో పోల్చి చూచినపుడు స్త్రీలు వారిలో పదిశాతం మాత్రమే కనబడతారు. అనేకమంది స్త్రీలు ప్రభుత్వంలో సంయుక్త శాఖాధిపతులుగా, ఉప శాఖాధిపతులుగా చేస్తు

న్నారు. శాఖాధిపతులుగాకూడ ఇప్పుడిప్పుడు వస్తున్నారు. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్‌లో సమాచార, ప్రసారశాఖాధిపతిగా ఒక స్త్రీయే నిర్వహించడం కనబడుతోంది. పూర్వం శ్రీమతి రాజ్యం, నేడు ప్రస్తుతం శ్రీమతి వనజాక్షి కనబడతారు. కేంద్రంలో 1952నుంచీ ఇద్దరు కేబినెట్ మంత్రులు, 85 మంది స్టేటు మంత్రులుగా, డిప్యూటీ మంత్రులుగా 1975 వరకు చేశారు. అనేకరంగాలలో స్త్రీలు ప్రయత్నించి ప్రసిద్ధులైనవారున్నారు. అయితే వారి సంఖ్య అత్యల్పం. అలాంటి వారిలో దక్షిణ భారతం, బొంబాయి స్త్రీలలో ఆరంభం ఎక్కువ.

కేంద్ర ప్రభుత్వంలోని సీనియర్ అధికారులుగా ఉన్నస్త్రీలు ఆ పదవులు ఇతరులు దయాదాక్షిణ్యాలవల్ల పొందలేదు. పురుషులతో పోటీపడి స్వీయ ప్రజ్ఞాప్రాభవాలవల్ల సంపాదించినవి మాత్రమే. ప్రస్తుత అధికారులందరిలోను సీనియరు అధికారి ఎమ్. ఆర్. అన్నా జార్జి. వ్యవసాయ శాఖలో సంయుక్త కార్యదర్శి సరళా సైగాల్. పురుషునిలాగా తన విధులను సమర్థవంతంగా నిర్వహింపగలిగింది. జిల్లా అధికారిగా, కుటుంబ నియంత్రణా కమీషనరుగా, ఆరోగ్యశాఖ సంయుక్త కార్యదర్శిగా కూడ అద్భుతమైన కృషి చేసింది. రమా మజుందార్ వాణిజ్యశాఖ కార్యదర్శిగా రాష్ట్రప్ ఆర్థికశాఖలో పనిచేస్తున్నారు. సూనుకోచ్ విదేశ వ్యవహార శాఖలోను పనిచేస్తూ భారతీయ సాంస్కృతిక సంబంధాల కౌన్సిల్‌లో ఉంది.

ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో ప్రొఫెసరు ధర్మకుమారి ఒక ప్రముఖ మహిళామణి. ఆర్థిక శాఖలో నాలుగు సంవత్సరాలు పనిచేసి మహోజ్జ్వలంగా కర్తవ్యాన్ని నిర్వహించిన ధీశాలిని ఆమె. 'కామన్ మార్కెట్' అనే గ్రంథాన్నికూడ ఇటీవల రచించింది. ప్రపంచ బ్యాంకులోను, ప్రపంచ వ్యవహారాలు భారతీయశాఖలోకూడ పనిచేసింది.

కపిల కౌత్యాయని భారతీయ నాట్యశాస్త్రంలో ప్రసిద్ధిగాంచింది. విద్యాశాఖలో సంయుక్త సలహాదారుగ, సాంస్కృతిక శాఖలో సంయుక్త కార్యదర్శిగ కూడ ఆమె పనిచేసింది. అంతర్జాతీయ సంబంధాలు సంస్కృతి చిత్రకళా ప్రదర్శనలు, పురాతన రేఖా గ్రంథాలయాలు, ప్లాస్టిక్ చిత్రాలను తయారుచేసే స్వచ్ఛంద సేవాసంస్థలు; ఉదాహరణకు ఖుదాభిక్ష గ్రంథాలయం, రామ్‌పూర్ రేఖా గ్రంథాలయం మొదలయిన అమూల్యమయిన చారిత్రక, సాంస్కృతిక వస్తు సంపదలు గలిగిన అనేక సంస్థల బాధ్యత వహించవలసి రావడంవల్ల ఆమె తాను పనిచేసేశాఖల్లో పనిచేసే అవకాశాలు కొంతవరకు కుంటుపడుతూ ఉండటం కూడా జరుగుతోంది.

విజయముళే అనే మరొక మహిళ ఆటవిక విద్యాలయంలో ఉపాధ్యాయిని. కాని ఆమె కార్యకలాపాలు విద్యారంగాన్నిదాటి ఫిల్మ్ ప్రపంచంలోకి వ్యాపించాయి. భారతదేశంలో ప్రప్రథమ ఫిల్మ్ సొసైటీని స్థాపించిన ఖ్యాతి ఆమెకు దక్కింది. అనగా దానికి ఆమె వ్యవస్థాపకురాలన్న మాట. అంతేకాదు; 'ఏక్ అనేక్ ఔర్ ఏకతా'' అనే విద్యా విషయిక ఫిల్మును తీసి అవార్డుకూడ పొందిన ధీశాలిని. 'భావన షోమి' అనే అందాలచిందించుఫిల్ములో ఆమెపత్రిక కీర్తిప్రతిష్ఠలనుసంతరించుకుంది. ఈనాడామె సాటిలైటు ఉపాధ్యాయ శిక్షణనిచ్చే శాఖకు అధిపతిగా వుండి 12 ఫిల్ములను వివిధ భాషల్లో తయారుచేస్తోంది. ఆ ఫిల్ములు బహిరంగ విశ్వవిద్యాలయాల లాగ ఉపాధ్యాయులకు శిక్షణ నియ్యగలవు. ఇది ఉన్నతోన్నత రీతిలో ఉన్న స్వీయకృషి. దాన్ని విస్తృతం చేసినట్లయితే అనేక ప్రాంతీయ సంస్కృతులు, రీతులు, భాషలకు అనుగుణంగా రూపొందించడానికి చేసే మౌలికమయిన కృషి అవుతుంది.

పద్మారామచంద్రన్ విద్యా సాంఘిక సంక్షేమ శాఖల్లో డిప్యూటీ సెక్రటరీ. ఆ పదవిలోని భారమయిన బాధ్యతలనెంతో ఓర్పుతో, నేర్పుతో

నిర్వహించిన మహిళామణి. అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంలో మెక్సికో సమావేశానికి కావలసిన విషయ సేకరణ బాధ్యత ఆమె వహించింది. ప్రతిభావంతంగా దానిని నిర్వహించిన ఖ్యాతి కూడ సంపాదించింది. మహారాష్ట్ర విద్యా శాఖామాత్యులుగావున్న శ్రీమతి ప్రభారావు నాయకత్వాన మెక్సికో సమావేశానికి వెళ్లిన ప్రతినిధివర్గ సభ్యురాలుకూడ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో భారతజాతీయ కమిటీకి ఆనాటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి అధ్యక్షులుగా ఉండి ఆనీబిసెంటును గురించి గంభీరోపన్యాసంతో దేశంలో అంతర్జాతీయ సంవత్సరాన్ని ప్రారంభించారు. దాని కార్యక్రమాన్నికూడ ఆమే నిర్ణయించారు. సమానమయిన పనికి స్త్రీ పురుషులిద్దరికీ సమాన వేతనాన్నియ్యాలని సెప్టెంబరు 25, 1975 నుంచి ఆర్డినెన్సుకూడ ప్రవేశపెట్టారు. అంతర్జాతీయ మహిళాసభ, భారత శాఖ స్త్రీల స్వచ్ఛంద సేవా సంస్థలను గురించిన వివిధ ఉద్యోగాలు, కళలు, సంక్షేమ కార్యక్రమాలు, రాజకీయ రంగంలోవున్న మహిళలను గురించిన వివరాలను సేకరించి స్త్రీల డైరెక్టరీని తీసుకుని రావాలని అందరినీ సమీకరించ నారంభించింది.

1947లో స్వాతంత్ర్యాన్ని సంపాదించిన వెంటనే పురుషులతో సమానంగా పరిపాలన, విదేశాంగ శాఖల్లో పనిచేయడానికి స్త్రీలు ముందుకు వచ్చి నిలబడ్డారు. ప్రతి సంవత్సరం సెకండరీ విద్యాలయ పరీక్షల్లో అనేక మంది బాలికలు ప్రథములుగా కృతార్థులవడం కూడ గమనించడం ముఖ్యం. దేశమంతటా సహవిద్యా విధానం ప్రబలంగా ఉంది. కేవలం పురుషుల కోసమేఉన్న ఢిల్లీ సెంట్ స్టీఫెన్ కళాశాలకూడ తన కవాటాలు స్త్రీలకు తెరచివేసింది.

# స్త్రీలు - విదేశాంగశాఖ

భారత విదేశాంగ శాఖలో 1975లో 13 మంది స్త్రీలు పబ్లిక్
సర్వీసు కమీషన్‌చేత ఎన్నుకోబడి శిక్షణకు పంపబడ్డారు. శిక్షణానంతరం
పరిపాలనా విషయ పరీక్షలో కృతార్థులై ఆ మంత్రిత్వ శాఖలో పని చేస్తూ
ఉన్నారు. ఆ శాఖలో 7గురు స్త్రీలు అండర్ సెక్రటరీలుగా చేస్తున్నారు.
కలకత్తా సెక్రటేరియట్‌లో ఇలాషూ కన్య, ఐక్యరాజ్యసమితి బిల్లదగ్గర
కున్నాడే కన్య, శ్రీమతి యల్. కె. తౌవాట్ల, కుమారి బాలసుబ్రహ్మణ్యం,
శ్రీమతి వి. యస్. కె. త్రిపాఠి, శ్రీమతి మైనాసేబాల్ మొదలయినవారు
విదేశ వ్యవహారాలలో, ఇతర విభాగాలలో సమర్థవంతంగా కర్తవ్యాలను
నిర్వహిస్తున్నారు. నాగా కొండలనుంచి వచ్చిన కుమారి ఎన్. హారాలు
విదేశాంగ కార్యాలయంలో ప్రస్తుతం పనిచేసే ఏకైక ఉప కార్యదర్శిని
అదే హోదాలో, ఇతర హోదాలో శ్రీమతి ఎమ్. బహదూర్ హనోయ్‌లో
ప్రథమ కార్యదర్శిగా, హెలెన్. జె. మత్తాయి క్రొలంబోలో ప్రథమ కార్య
దర్శిగాను, జకార్తాలో నిర్మాలా ప్రసాద్, బాంకాక్‌లో శ్రీమతి కమలేష్
కుమారి, ఖాట్మండులో శశి త్రిపాఠి, మాస్కోలో నీనాసిక్రీ, రెండో సెక్రట
రీలుగాను, కుమారి ఘోష్ ఐక్యరాజ్య సమితిలో భారతీయ శాశ్వత కమీష
నకు ప్రథమ కార్యదర్శిగాను కుమారి సిషేరాస్ భారత కౌన్సిల్‌లో
సాంస్కృతీ వ్యవహారాలకు ఉప కార్యదర్శిగాను తమ తమ బాధ్యతలను
నిర్వహిస్తూ ఉన్నారు. మూసుకోచ్ ప్రప్రథమంగా విదేశాంగ శాఖకు సంబం
ధించిన వారిలో ఒకరిని వివాహమాడి ఆ శాఖలో స్థిరపడింది. ఆమె
పారిస్‌లో ద్వితీయ కార్యదర్శిగా కూడ పనిచేసింది. కొంతకాలం అణుశక్తి
కమీషన్‌లో పనిచేసింది. ప్రప్రథమంగా చేరి తమ్ము బాధ్యతలను ఈ విధంగా
ఈ రంగంలో నిర్వహించిన వారిలో రమా మెహతా ఒకామె. ఆమె భర్త

గారు విదేశాంగ వ్యవహారాలశాఖలో ఉపకార్యదర్శి పదవీ విరమణానంతరువాత రమా మెహతా రచనా వ్యాసాంగంలో, సోషయాలజీలో పేరు ప్రఖ్యాతులు గడించింది. తరిశిబల్ ఆనాటి ఖాన్సుస్లే. తరువాత శిబల్‌ను వివాహమాడి శిబల్‌గా మారింది. ఆమెకూడ పదవీ విరమణ గావించింది. మీరా సిన్హా సూర్జిత్ మాన్‌సింగ్‌లు కూడ రాజీనామా చేశారు. మీరాలో ఉద్యోగం స్వీకరించింది. ప్రస్తుతం ఢిల్లీ విశ్వవిద్యాలయంలో చైనీయుల భాషను బోధిస్తూ ఉంది. సుర్జిత్ పారిస్, వాషింగ్టన్ నగరాలలో చేస్తూ ఉంది. ఆమె ఛార్లెస్‌ను వివాహమాడింది. ఆయన ప్రాచీన భారతీయ వ్యవహారాలలో గొప్ప పండితుడు. ఆమె వివాహానికి ముందు స్వాతంత్ర్యోదయానికి ముందున్న భారతీయ చరిత్రను రాస్తూ ఉన్నాడు.

మనోరమ భల్లా కొలంబోలో భారతీయ హైకమిషనరు పదవి స్వీకరించడంతో రాయబార కార్యాలయాలలోని ఉన్నతోన్నత పదవిని స్త్రీలు చేపట్టడం ప్రారంభమయింది. 1949లో ఆ శాఖలో ప్రవేశించిన చోన్వియా బెలియప్ప పారిస్, లండన్, రంగూన్ నగరాలలో తన విధులను నిర్వహించిన తరువాత హంగేరీలో భారత రాయబారిగా వెళ్ళింది. అప్పటికే ఆమె ఒట్టావా, కొలంబో, కౌలాలంపూర్, కాన్బెర్రాలలో పనిచేసింది. 1951లో లండన్‌లో భారత హైకమీషనర్ కార్యాలయంలో ఎక్సిక్యూటివ్ అధికారిగా నియమింపబడింది.

ప్రఖ్యాత విప్లవ రచయిత్రి, భారత దేశ 'గానకోకిల' శ్రీమతి సరోజినీ నాయుడుగారి పుత్రిక లీలామణినాయుడు. విదేశాంగ కార్యాలయంలో ఉపకార్యదర్శిగా అనేక సంవత్సరాలు పనిచేసింది. 1961లో మరణించే వరకు ఆమె ఆ పనిలోనే వుంది. రాయబారి వృత్తిని స్వీకరించి రాయబారి

కార్యాలయంలో ప్రవేశించిన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ప్రపంచంలోనే ఏకైక మహిళ. సోవియట్ రష్యా, అమెరికా, బ్రిటన్ దేశాలలో ఆమె రాయబారిగా పనిచేశారు. ప్రప్రపంచంలో ఐక్యరాజ్యసమితికి అధ్యక్షత వహించిన ప్రప్రథమ మహిళ.

అమీనా అహూజా ఉద్యోగంలో లేకపోయినా ఆమె చేసిన కృషిని గురించి కొంచెం చెప్పితీరాలి. ప్రఖ్యాతి చెందిన భాషా శాస్త్రవేత్త అని ముందుగా చెప్పాలి. 1955లో బుల్గానిన్ కృశ్చేవ్‌ల భారత పర్యటనలో భారత ప్రభుత్వ అనువాదకురాలిగా వుంది. 1956లో ఇరాన్ షా పర్యటనలోకూడ ఆమె అనువాదకురాలుగానే ఉంది. ఉర్దూ, హిందీ, ఆంగ్లం, పర్షియన్, ఫ్రెంచి, ఇటాలియన్, రష్యన్, అరబ్బీ భాషల్లో ఆమెకు మంచి ప్రవేశం ఉంది. ఆమె థాయలాండ్, హానోయ్, పోలెండ్ విమానాశ్రయాలలో మాత్రమే కూర్చుని ఆయా భాషలు నేర్చుకోవాలని ఉన్నదని చెపుతూ ఉండేది. చివరకు ఆమెను జవహర్‌లాల్ విశ్వవిద్యాలయంలో రష్యన్ భాషా విభాగంలో సభ్యురాలిగా వేశారు. తరువాత రుమేనియాలోని భారతరాయబారిని వివాహమాడింది.

## సాంఘిక సేవారంగం - స్త్రీలు

దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ అనేక గౌరవ మన్ననలను అందుకోగలిగిన ప్రఖ్యాత విదుషీమణి. అందులో ఒకటి జాతీయ ప్రణాళికా సంఘంలో సభ్యురాలిగా ఉండడం, ఆ పదవిలో ప్రవేశించిన ప్రప్రథమ భారతీయ మహిళ. అది మన పంచవర్ష ప్రణాళికలను తయారుచేసే ఉన్నతోన్నత

సంస్థ. పదిహేను సంవత్సరాల ప్రాయంలో లాంఛనప్రాయంగా అభ్యసించిన విద్య. ఇంచుమించు మృగ్యమే అని చెప్పుతుందామె అనాటి చట్టధిక్కారణోద్యమంలో నాయకత్వం వహించిన ఆమె పెద్దలిచ్చిన నెక్‌లెస్ కాకినాడలో తెగనమ్మి ప్రయివేటు చెప్పించుకుని స్వయంకృషితో క్రమక్రమంగా పట్టభద్రురాలయింది. అంతటితో ఆమె ఆగలేదు. న్యాయశాస్త్రంలో పట్టా పొందగలిగిన ధీశాలిని. కేవలం స్వయంకృషి, శ్రద్ధాసక్తులవల్ల ఆమె ఆ పట్టా సాధించగలిగింది. స్వాతంత్ర్య పోరాటంలో కూడ ఆమె కార్యకలాపాలు తీవ్రంగా కొనసాగాయి. 'ఆంధ్ర దేవీజోన్' అనే బిరుదాన్ని కూడ పొందిన మహిళ: స్వాతంత్ర్యానంతరం కూడ ఆమె తన కార్యకలాపాలను తీవ్రంగా కొనసాగించగలిగింది. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ నిర్మాత ఆమే: స్త్రీలకు అనేక విధాలుగా ఉద్యోగావకాశాలను కలుగజేసిన ఆ సంస్థను వివిధ విధాలుగా రూపొందించగలిగిన అద్వితీయ ధీశాలిని దుర్గాబాయి. అంతేకాదు. దానిని నిర్మించి పాలించిన ప్రప్రథమ పాలకురాలు ఆమె కృషివల్ల ఆ సంస్థ దేశం నలుమూలలా 20,000 మంది స్వచ్ఛంద సేవికలను దేశంలోని స్త్రీ, శిశు సంక్షేమం కోసం సమీకరించింది.పదిహేను సంవత్సరాలపాటు అధ్యక్షురాలిగా ఉండి పాలించిన తరువాత తిరిగి సుప్రీం కోర్టు న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించింది. స్వాతంత్ర్యానికి పూర్వం ప్రభుత్వంలో ఉన్న నిరంకుశ విధానాన్నెదుర్కొని పోరాడటానికి, స్వాతంత్ర్యానంతరం స్వతంత్రంగా పనిచేసే విధానాలను రూపొందించడానికి స్వచ్ఛంద సేవికలను తయారుచేసి శిక్షణఇచ్చిన అసాధారణ శక్తి సంపన్నురాలు. ఆ పనిలో నిర్విరామంగా శక్తి సమర్థతలతో కృషిచేసిన ధీయరాలు. న్యాయవాదిగాఉండి హైదరాబాదు నగరంలో ఆంధ్ర మహిళా సభ నిర్మించడానికి పూనుకొన్న అపూర్వ నిర్మాత. అప్పటికే మదరాస్‌లో ఆంధ్ర మహిళాసభ సర్వతోముఖంగా వికసించింది. సేవా సంస్థగా, విద్యాలయంగా

పత్రికా కార్యాలయంగా, నర్సింగ్ శిక్షణాలయంగా, నర్సరీ పాఠశాలగా చివరకు స్త్రీలకు రిక్రియేషన్ క్లబ్‌గా కూడా ఆ మహిళా సభ రూపొందింది. హైదరాబాద్‌లో కూడా అక్షరాస్యత, విద్య, ఆరోగ్యాలకోసం నర్సింగ్ పాఠశాల, ఉన్నత పాఠశాల, కళాశాల, ఉపాధ్యాయ శిక్షణా కళాశాల, బొమ్మలు మొదలయిన చేతిపనుల్లో శిక్షణ ఇచ్చే వృత్తి విద్యాలయం మొదలయిన వివిధ సంస్థలున్న ఒక మహా సంస్థను ఆమె రూపొందించారు. ఉన్నతోన్నతమయిన విద్యా సంస్థగా దానిని తీర్చి దిద్దిన మహాశిల్పి శ్రీమతి దుర్గాబాయి. వివిధ రంగాలలో ఆమె సాధించిన విషయాల జాబితాను ఇవ్వాలన్న ఒక ప్రత్యేక డైరెక్టరీని తయారు చేయవలసి వస్తుంది. సాంఘికాభివృద్ధి కౌన్సిల్, జనాభా కౌన్సిల్, ఢిల్లీలో అంతర్జాతీయ కేంద్రం ఆమె చేత మలచబడ్డ మహా సంస్థలు. అంతర్జాతీయ కేంద్రానికి ప్రపంచం నలుమూలలనుంచీ విద్యావేత్తలు వచ్చి సభా వేశమవుతూ వుంటారు. ఈ సంస్థలతోపాటు భారతదేశంలో అనేకప్రాంతాల్లో ఉన్న అనేక సంస్థల భవనాలు ఆమె పేరుతో ముడిపడి పనిచేసేవి వున్నాయి. 1975లో ఆమెకు ఆమె భర్తగారయిన చింతామణి దేశముఖ్‌గారికి 'పద్మభూషణ' బిరుదాలనుఇచ్చి, భారత ప్రభుత్వం గౌరవించింది. ఈ దంపతులను ఈ విధంగా ఉన్నతోన్నతమయిన బిరుదులనిచ్చి గౌరవించడంవల్ల ఒక ఉన్నతపథంలో జరిగిన మహోన్నత కృషిని భారత ప్రభుత్వం గుర్తించడం ముదావహం.

# స్త్రీలు - మునిసిపల్ పరిపాలన

ఢిల్లీ మునిసిపల్ కమిటీ అధ్యక్షపదవి చిరకాలంగా పరిపాలనలో ఉన్న ఒక ఉన్నతోన్నత ఉద్యోగికి ప్రత్యేకించబడివుంది. కాని మొట్టమొదటిసారి విద్యా బెన్‌షా దానికి అధ్యక్షురాలిగా నియమించబడిన మహిళ. అరుదయిన ఈ అవకాశం లభించిన ప్రప్రథమ మహిళ. అప్పటికి రెండు సంవత్సరాలనుంచి దానికి ఉపాధ్యక్షురాలిగాఉన్న ఆమెకా అవకాశం లభించింది. అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఆమెకా పదవినీయడం ప్రప్రథమ మహిళా అభ్యుదయ చిహ్నంగా గుర్తింపబడింది. గతంలో మదరాసు కార్పొరేషన్‌లో తారాచెరియన్ మేయరుగా ఎన్నుకోబడింది. మేరీ క్లబ్ వాలా మదరాసు షరీఫ్‌గా ఎన్నుకోబడింది. అలాగే బొంబాయి షరీఫ్‌గా మిఠాన్‌లాను, ఢిల్లీ మేయరుగా అరుణా అసఫాలీలుకూడ ఎన్నుకోబడి గణనీయమైన కృషి చేశారు.

# స్వచ్ఛంద సేవారంగం - స్త్రీలు

ఈ రంగంలో కృషిని తెలియజేయడం కష్టతరమయిన పని. అనేక రంగాలలో అనేకవిధాలుగా కృషిచేసిన, చేస్తున్న మహిళలనేకులు ఉన్నారు. అభివృద్ధి చెందని దేశాల ఆర్థిక విధానాలలో జీత భత్యాలు లేని పనులను నిర్వహించే మహిళామణులనేకమంది ఉన్నారు. శిశు సంక్షేమం, వివిధ రూపాలలోనున్న వికలాంగుల సేవలు, అనాధ స్త్రీలకు చేసే సేవ మొదలైన వాట్లలో మహిళలు అమూల్యమైన సేవలు చేస్తూ ఉన్నారు. ఇలాంటి స్వచ్ఛంద సేవా సంస్థలు సుమారు ఏడువేలవరకు దేశమంతటా పని చేస్తున్నాయి. వాటికి కేంద్ర సాంఘీక సంక్షేమ బోర్డు గ్రాంటులను మంజూరు చేస్తోంది. ఆ సంస్థకు ఆదినుంచీ మహిళలె డైరెక్టర్లుగా నియమింప బడుతున్నారు. దాని క్రింద దేశంలో సుమారు 30,000కు పైగా నర్సరీ విద్యా

లయాలు పనిచేస్తూ ఉన్నాయి. ఇలాంటి స్థానిక సేవా సంస్థలను నిర్వ హించే స్వచ్ఛంద సేవికలు అంతర్జాతీయ సమావేశాలలో తరచుగా పురుషులతో కలిసి కూర్చోవలసి వస్తుంది. ఆసియా మొదలయిన ఖండాలలో వెనుకబడిన దేశాలనుంచి సాధారణంగా స్త్రీ ప్రతినిధులు హాజరౌతారు. సంపన్న దేశాలనుంచి వచ్చే ప్రతినిధులు సాధారణంగా పురుషులే. పురుషులందరు జీతాలతో పనిచేసేవారుగా ఉంటారు. వెనుకబడిన దేశాలనుంచి వచ్చే స్త్రీ ప్రతినిధులు మాత్రం స్వచ్ఛంద సేవికలన్న విషయం మరువరాదు.

స్త్రీలందరుకూడ నిస్వార్థసేవ చేయగలిగేవారుండరు. అందువల్లనే గత శతాబ్దంలో సంపన్న కుటుంబాలనుంచి వచ్చిన మహిళలే ఈ రంగంలో ఎక్కువగా పనిచేయడం కనబడుతుంది. విద్యా, అలాగే బేగా లిద్దరు దంపతులు. ఇద్దరూ ప్రఖ్యాతి వహించిన ఆర్కిటెక్టులు. అత్యున్నత గౌరవ పూరితమైన అంతర్జాతీయ ఆర్కిటెక్చర్ రంగంలో అత్యవసర పరిస్థితుల్లో అలనాటి డిజైనను చిత్రీకరించినందుకు ఇటీవలకాలలోం బహుమతినికూడ సంపాదించారు. ఆ బహుమతి ఒక అపూర్వ బహుమతి అనవచ్చు. తంగమ్ ఫిలిప్పు హోటల్ నిర్వహణ, కేటరింగ్ టెక్నాలజీ, అప్లైడు న్యూట్రిషన్ సంస్థకు ప్రిన్సిపాల్. అంతర్జాతీయ రంగంలో F. A C. Ceres మెడల్ పొందిన బహుకొద్దిమంది మహిళల్లో ఆమె ఒకరు. అంతకుముందు రెండుసంవత్సరాలక్రితం అరుదయిన ఆ గౌరవ మర్యాదలనందుకునే భాగ్యం శ్రీమతి ఇందిరాగాంధికి లభించింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో కావించిన విశిష్ట సేవలకు ధన్వంతి రామారావు సతి, ఆరాబాయి వాడియా అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించారు. రాజకుమారి అమృత్ కౌర్ చివరిరోజుల్లో అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంస్థకు అధ్యక్షురాలయ్యారు. భారతీయ రెడ్ క్రాస్ సంస్థకుకూడ ఆమే అధ్యక్షురాలు. హాన్నాసేన్, శ్రీమతి ఇందిరాగాంధి, తారా అలీబేగ్‌లు కూడ అంతర్జాతీయ సంస్థకు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. వారిలో లక్ష్మీ మీనన్

స్త్రీల స్థాయి సంఘంలో సుప్రసిద్ధురాలు, ఆ సంఘానికి అధ్యక్షురాలు. హన్నా సేన్ ఉపాధ్యక్షురాలు. మరికొంతమంది మహిళలు అంతర్జాతీయ సమితి సీనియర్ ఆఫీసులో పనిచేస్తున్నారు. వారిలో అంతర్జాతీయ సమితి మానవ హక్కుల సంఘం, న్యూయార్కులో రసిల్‌బసు స్త్రీలకు పురుషులతో సమాన స్థాయిని పెంపొందించడానికి కృషిచేసే విభాగంలో పని చేస్తోంది. జనీవాలో అనితాగుహ అనే శాస్త్రవేత్త U.N.C.T.A.D. లో పని చేస్తోంది. లండన్‌లో కూడ ఆమె సుప్రసిద్ధమయిన ఉద్యోగాన్ని నిర్వహించింది. వ్యవసాయ, ఆర్థిక శాస్త్రాలలో సుప్రసిద్ధురాలయిన ఉమా లేలే ప్రపంచ బ్యాంకులో పనిచేస్తోంది. రామారావు సతి కుటుంబనియంత్రణలో అంతర్జాతీయంగా అసాధారణమయిన కీర్తి ప్రతిష్టలను ఆర్జించగలిగింది. ఈనాటివరకు మహిళోద్యమంలో కుటుంబనియంత్రణలో రామారావు సతి గావించిన విశిష్టసేవలు పురాణగాథల్లాగా ప్రసిద్ధి గాంచాయి. సుప్రసిద్ధ రచయిత్రి శాంతారామారావు, ప్రసిద్ధ వణిక్ప్రముఖురాలు ప్రమీలా వాగ్లె లిద్దరు ఆమె పుత్రికలు ఆమె పుత్రికలిద్దరు కూడ వారి వారి రంగాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. ప్రమీల దుస్తులను తయారుచేసి విదేశాలకు ఎగుమతిచేసే వాణిజ్య వ్యాపారంలో వాసిగాంచింది. మనుమరాలు ఆషా వాగ్లే వీరిద్దరిని మించిపోయింది. ఆర్థిక ప్రపంచంలో ఆమె తారాపథాని కెగసింది. ఆమె నిర్వహించే వ్యాపారాన్ని లండన్ నగరంలో ఆరుగురు మహిళలు నిర్వహిస్తున్నారట. వారిలో బార్బరా కాసిల్ తోపాటు ఆషా వాగ్లే బ్రిటన్ మొత్తంలో పేరు ప్రతిష్టలను గడించిందని ఒక ప్రఖ్యాత బ్రిటిష్ పత్రిక రాసింది. అంతర్జాతీయ విశ్వవిద్యాలయంలో విశిష్టతను గడించిన మహిళామణులుకూడ అనేకులున్నారు. న్యూయార్కు కళాశాలలో ఆంగ్ల సాహిత్య విభాగానికి డైరుక్టరుగాఉన్న సీతానరసింహారావు ప్రసిద్ధిగాంచిన విదుషీమణి. సుమతీమొరార్జీ వాణిజ్య ప్రపంచంలో అగ్రశ్రేణిలో ఉన్న మహిళ. ఆమె సంవత్సరాల తరబడి సింధియా షిప్పింగ్

కంపెనీ డైరెక్టరుగా ఉంటె దూరదృష్టితో, నిపుణతతో ఆ పదవిని అద్భుతంగా నిర్వహించే అత్యద్భుత మహిళ.

## ముద్రణారంగం - స్త్రీలు

ఈరంగంలో స్త్రీలు కొంత పరిమితంగా ఉన్నారు. ఇందులో ఇద్దరు మాత్రం ప్రఖ్యాతి వహించారు. కలకత్తాలోని సిగ్నెట్ ముద్రణాలయాన్ని నిర్వహించే నీలిమాదేవి వారిలో ఒకరు. జవహరు పండితుని సుప్రసిద్ధ గ్రంథం 'భారత దర్శనం' ఆమె ప్రచురించింది. రెండో ఆమె ఢిల్లీలోని వికాస ప్రచురణాలయానికి అధిపతి శ్రీమతి ఎన్. బాల్కీ. రోజురోజుకు ప్రపంచభాష లన్నిటిలో స్త్రీలు క్రమంగా పెంపొందుతున్నారు. కమలా మార్కండన్ అలాంటి వారిలో ఒకరు. 'జల్లెడలో మధువు' నయనతారా తారా సెహగల్‌కు మరుపరాని మధుర కావ్య మయింది. కమలాదాస్, 'అమృత ప్రీతమ్' మహాదేవివర్మ, ఆశాపూర్ణదేవి, ఖురాతిల్లన్ హైదర్ మొదలయినవారి రచనలు లలిత గంభీరములయిన రచనలు. ఉర్దూ, బెంగాలీ భాషల్లో కూడ వారి రచనలు కొనసాగాయి. ఇంకా అనేకమంది యువరచయిత్రులు ఆధునిక విషయాలకు సంబంధించిన సన్నివేశాలను కడుడుగట్టిన సమాజంలో సంఘటనలను స్వీకరించి స్త్రీల పాత్రలను, వారి దుస్థితిని గురించి మనసుకు హత్తుకునే రీతిలో చిత్రించగలుగుతున్నారు. భారతీయ జ్ఞాన పీఠానికి చెందిన కుంతీజైను, ఢిల్లీలో మృణాలాగార్గ్, కృష్ణ సొబితి, మన్నూభరావ్, కృష్ణ అగ్నిహోత్ర మొదలయినవారు ఆ కోవకు చెందిన రచయిత్రులు. వారిలో చివరివారు స్త్రీల దుస్థితికి స్త్రీ యెంతవరకు బాధ్యులో తెలుపుతూ రచనలు సాగించారు. స్త్రీలకు వ్యతిరేకంగా ఉండి క్రూరంగా బాధించి, హింసించే ఆచారాలను, సంప్రదాయాలను అంటిపెట్టుకుని ఉండటంలో స్త్రీ యే అధికతరమయిన బాధ్యతను వహిస్తోందన్న విష

యాన్ని ఆమె రచనల్లో విశదపరచింది. ప్రభాజ్యోతి కౌర్ ప్రఖ్యాత రచయిత్రిగా ఫిలిప్పైన్సులో అవార్డు పొందింది.



## పత్రికారంగం - స్త్రీలు



ఈరంగంలోకూడ స్త్రీలు ప్రఖ్యాతి వహించారు. అనేకమంది మహిళలు విదేశ పత్రికలకుకూడ విలేఖరులుగా ప్రఖ్యాతి వహించారు. ఇంకా వహిస్తున్నారు. రజియా ఇస్మాయిల్ అలాంటివారిలో ఒకరు. ఆమె 'క్రిష్టియన్ సైన్సు మానిటర్'కు క్రమంగా వ్యాసాలు పంపుతూ ఉంటారు. ఆమెతోపాటు అమితామాలిక్ ఫిల్మ్ విమర్శకురాలిగా ప్రసిద్ధి గాంచింది. ఆమె ప్రస్తుతం విదేశాలలో 'భారతీయ ప్రతిష్ట' అనే విషయంపై సిమ్లాలో అడ్వాన్సుడు స్టడీస్ సంస్థలో పరిశోధన చేస్తూ ఉంది. దానిమీద ఒక గ్రంథాన్నికూడ రచిస్తోంది. రానిబొర్రా వియత్నాం యుద్ధ వృత్తాంతాన్ని గురించి రాసిన ప్రప్రథమ మహిళా విలేఖరి. ప్రస్తుతం స్టేట్స్‌మన్ పత్రికా నిర్వహణలో పనిచేస్తోంది. ఆమె వార్తలను భారతీయ పత్రికలు, మాంచెస్టరు గార్డియన్, న్యూయార్కు టైమ్సు మొదలయిన విదేశ పత్రికలు కూడ ప్రచురించాయి. ప్రమీలా కల్హాన్ మరొక సుప్రసిద్ధ పత్రికా సంపాదకవర్గ సభ్యురాలు. ఆమె హిందూస్థాన్ టైమ్సులో పనిచేస్తోంది. రాజకీయ, సాంఘిక సమస్యలను నిర్భయంగా అత్యంత నిపుణతతో నిర్వహించగల సమర్థురాలు. ప్రసిద్ధిగాంచిన ప్రతి దినపత్రికలో విలేఖరులుగా అనేకమంది మహిళలున్నారు. ఫ్రాన్సులోని ఫ్రాన్సు ఎక్స్‌ప్రెస్ ఫ్రాంకోయిస్ జిరాడ్ లాంటి పత్రికా సంపాచకురాలిలాగ జాతీయ దినపత్రికకు సంపాదకురాలిగా ఉన్న మహిళ. ఈ దేశంలో ఇంతవరకు అంత విజయం గాంచినట్లు కనబడడంలేదు. వాషింగ్టన్ పోస్టు పత్రికా అధ్యక్షురాలు ఒక మహిళ. ఇది స్త్రీలందరకు గర్వకారణంకదా! ఇలాంటి పదవుల్లో మనదేశంలో స్త్రీలు

కనబడడంలేదు. 'లింకు' పత్రికలో అరుణా అసఫాలీ, 'ఈవ్స్ వీక్లీ' గుల్షన్ ఇవాన్ సంపాదకురాళ్ళుగా ఉన్నారు. 'యూత్ టైమ్స్' అనే అభ్యుదయ మార్గంలో పయనిస్తోన్న పత్రికకు యూనీస్ జంగ్ సంపాదకురాలుగా ఉంది. ఖోరాతుల్లీన అనే సుప్రసిద్ధ రచయిత్రికూడ పత్రికలో పనిచేస్తోంది. ఒకప్పుడు ఇందిరాగాంధీని అద్భుతంగారాసి తరువాత వ్యతిరేకంగా ఇటీవల రాసిన ఉమా వాసుదేవ్ ప్రతిభావంతమయిన రచనలు చేయగలిగిన మరొక రచయిత్రి. 'సర్ఫ్' అనే నూతన పత్రికకు ఆమె సంపాదకురాలు. ఆమె సోదరి అరుణ స్వీడన్, ఫ్రాన్స్‌లో ప్రొఫెసరు.

## సమాచార టూరిజాలు - స్త్రీలు

అనేకమంది స్త్రీలు ప్రకటనా విభాగాలలోను టూరిజంలోను పనిచేస్తున్నారు. ఈ రెంటింటిలోను టూరిజంలో పనిచేసే మహిళలు అధికసంఖ్యలో ఉన్నట్లు కనబడుతుంది. టి. వి. రేడియోల్లో పనిచేసేవారుకూడ అనేకమంది ఉన్నారు. వాస్తవానికి శాఖల్లోని కొన్ని విభాగాలలో స్త్రీలు పురుషులను మించినట్లు కనబడుతుంది. నూరు స్వామినాథన్ జె. థాంప్సన్ (వాల్టరు) లో అగ్రశ్రేణి నిర్వహణాధికారి. ప్రకటనల విభాగంలో సాధారణంగా కొన్ని మాత్రమే అగ్రశ్రేణి ఉద్యోగాలుంటాయి. కాపీ రాయడం; బొమ్మలు గీయడం మొదలయిన విభాగాలలో ఉద్యోగాలెక్కువగా ఉంటాయి. ఢిల్లీలో తారా సిన్హా ఉన్నతశ్రేణి ఉద్యోగిగా పనిచేస్తోంది. అంజనీ మెహతా మంత్రిత్వ శాఖలో ఆఫీసరుగా సుమారు పదిసంవత్సరాలుగా పనిచేస్తోంది. సంయుక్త డైరెక్టర్ జనరల్‌గా ఉన్నది. టూరిజం, సివిల్ అవియేషన్ శాఖలో కొంత కాలం వరకు స్టేట్ మంత్రిణిగా కూడ ఉంది. టూరిజంలో శ్రీమతి కె. యన్. బెనర్జీ, శ్రీమతి పాణిగ్రాణి, డైరెక్టర్, డిప్యూటీ డైరెక్టర్ జనరల్స్‌గా ఉన్నారు. ఈ శాఖలో అశామల్‌హోత్ర లండన్‌లో స్వతంత్ర బాధ్యతలను

కలిగియున్నది. మీనాక్షి కృష్ణమూర్తి జినీవాలో కొంత కాలం ఫ్రాంక్ ఫర్ట్‌లో యూనిసెఫ్ ప్రాంతీయ డైరెక్టర్ క్రింద పనిచేస్తున్నారు. న్యూయార్కు నగరంలో ప్రాంతీయ డైరెక్టర్ దగ్గర లీలానాథన్ పనిచేస్తోంది. టూరిజంలో ప్రథమశ్రేణి ఉద్యోగాలలో స్త్రీలు యించుమించు పురుషులతో సమానంగా ఉన్నారు.

ఢిల్లీ టెలివిజన్‌లో సేవరంజ్నీలాంటి మహిళా ప్రొడ్యూసర్లు అనేక మంది ఉన్నారు. ఈమె పిల్లల ఫిల్ము సంస్థలో ప్రొడ్యూసరు. రంగస్థల నాటకాలను స్వతంత్రరీతిలో అద్భుతంగా దర్శకత్వం వహించగల ధీశాలిని. 'షిషారాయ్' హెచ్-బి-కౌర్, సుధాచోప్రా, టి. వి. కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఇరామజుందార్ కలకత్తా టి. వి. కేంద్రంలో కార్యక్రమాలను నిర్వహిస్తోంది. ఈ టి. వి. మన దేశంలో ఇటీవలకాలంలోనే ప్రారంభమయింది.

రేడియోవచ్చి సుమారొక అర్థశతాబ్దం దాటింది. ఈ మధ్య పదవీ విరమణ గావించిన సీనియర్ ఉద్యోగుల్లో మెహ్రా మసాని ఒకరు. ముప్ఫయి సంవత్సరాలు రేడియోలో పనిచేసి అత్యున్నత పదవులయిన స్టేషన్ డైరెక్టర్, డిప్యూటీ డైరెక్టర్ జనరల్ కూడ నిర్వహించింది. 1962 నుంచి 1971 వరకు ఈ ఉన్నతోన్నత పదవి నిర్వహించింది. అంతర్జాతీయ వార్తా ప్రసార సంస్థలో ఈనాడున్న భారతీయ ట్రస్టీ యిద్దరిలో ఆమెకూడ ఒకరు. ఈ సంస్థ కేవలం అంతర్జాతీయ వార్తాప్రసారంలో ఉద్యోగ సమస్యలకు మాత్రం సంబంధించింది. దాని కామెను ఉపాధ్యక్షురాలిగా ఎన్నుకొన్నారు. ఢిల్లీ రేడియో స్టేషన్‌లో లలితానేనగుప్త, శాంతారాలియా రాయ్ ఒకరు రైతుల విభాగానికి, మరొకరు గ్రామీణ గృహసంబంధ వార్తల విభాగానికి డైరెక్టర్లుగా ఉన్నారు. రేడియో వార్తాప్రసారంలో స్త్రీలు పురుషులను అధిగమిస్తున్నారు. వార్తలను తయారుచేసే విధానంలోకూడ స్త్రీలదే పైచేయిగా ఉంది. లోషన్ మీనన్ కొన్ని సంవత్సరాలపాటు వార్తా ప్రసారంలో

ప్రజాదరణను, అభిమానాన్ని ప్రబలంగా పొందిన మహిళ. తరువాత ఆమె ప్రయాణ సౌకర్యాలను కలుగజేసే సంస్థలో సీనియర్ నిర్వహణాధికారిగా ఉంది. పామీలాసింగ్, లోతికారత్నాలు ప్రకటనదార్లు. వార్తలను చక్కగా తయారుచేసేవారు వీరి దగ్గర నేర్చుకోవచ్చు. ఆ విషయంలో ఇద్దరికీ స్పష్టమయిన ఖంగున మ్రోగే కంఠధ్వని కూడా ఉంది. భారతీయ ఉచ్చారణ, విదేశీ ఉచ్చారణ కూడావీరిది స్పష్టంగా దోషరహితంగా ఉంటుంది. త్రిప్తి మిత్ర ఎమిరిషన్ రేడియోకేంద్రంలో ప్రొడ్యూసర్ పదవిని పొందింది.

# వాణిజ్యరంగం - స్త్రీలు

ఉత్సాహవంతులయిన మహిళలనేకులు వాణిజ్య ప్రపంచంలోకికూడ ప్రవేశిస్తున్నారు. వాణిజ్య మంత్రిత్వశాఖలో భారతప్రభుత్వ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్, ఎగుమతి దిగుమతి వ్యవహారాలను, సుంకసరుకులను విభజించడం మొదలయినవానిని నిర్వహిస్తోంది. బ్రహ్మాండమయిన ఈ సంస్థలో ముఖ్య ఆర్థికవేత్త షీలా అంబే గాయంకర్. ప్రధాన భాగమయిన నిర్వహణ శాఖాధిపత్యాన్ని ఆమె వహిస్తూంది. శ్రీమతి సూర్జిత్ బోర్డు సెక్రటరీగా ఉంది. అరుణారాయ్ డ్రగ్గులు ఫార్మాస్యూటికల్స్ విభాగంలో ముఖ్య, మార్కెటింగ్ మానేజర్. సుమారు యాభైరకాల మందులను, 400 కోట్లు. విలువయినవాటని 2500 యూనిట్లను చూస్తోంది. ఇంతకు పూర్వం F. A. O డైరెక్టర్ జనరల్‌గా చేసిన బి. ఆర్. సేన్ గారి పుత్రిక. మరొక సీనియర్ ఉద్యోగి శ్రీమతి పి. జె. కృష్ణన్ అత్యంత ప్రధానమైన ఒక విభాగానికి ఆమె డిప్యూటీ మార్కెటింగ్ మానేజరు, క్రొవ్వులు, నూనెలు దిగుమతి చేసికొనే విభాగమది. ఆ రెండుదేశ ఆర్థిక పరిస్థితులను పునరుద్ధరించడంలో అత్యంత ప్రధానమయిన పాత్ర వహిస్తున్నాయి. నూనె లేక అన్నం రొట్టె తప్ప ఏ భారతీయ వంటకం తయారుకాదు. అందుచేత నే ఆ విభాగానికంత ప్రాధాన్యం.

# చేతి పనులు - స్త్రీలు

భారతీయ చేతిపనులు విదేశాలలో బహుళ ప్రజాదరణను ప్రాచీన కాలంనుంచీ పొందుతున్నాయి. ప్రాచీన కుటీర పరిశ్రమలను పునరుద్ధరించడం, ఆ హస్తనైపుణ్యానికి పునరుజ్జీవనం పొందించడం ముఖ్యంగా స్త్రీల వంతయింది. ఢిల్లీలో ఒకమూల ఒకచిన్న కేంద్రాన్ని శరణార్థుల సహాయానికి ముగ్గురు ప్రఖ్యాత మహిళామణులు ప్రారంభించారు. అలా ప్రారంభించిన వారే ప్రేమ్ బెరీ, కిట్టీ శివరావు, పోకినెహ్రూ. ఈ ముగ్గురు మహిళా మణులు ఇంటింటికి తిరిగి శరణార్థుల చేతులతో తయారయిన వస్తువులు అమ్మారు. క్రమంగా వారు ప్రారంభించిన కేంద్రం ప్రసిద్ధకుటీర పరిశ్రమగా మారి ఈనాడు సంవత్సరానికి సుమారు 1 1/4 కోట్ల వ్యాపారాన్ని సాగిస్తూంది. ముగ్గురు మహిళల్లో ప్రేమ్‌బెరీ రెడీమేడ్ దుస్తులు ఎగుమతిచేసే సంస్థకు డైరెక్టరుగా ఉంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కెనడా జర్మనీ, లండన్, స్విట్జర్లండ్, ఆస్ట్రేలియా, నార్వే, హాంకాంగ్ మొదలయిన దేశాలలో ఈ రంగంలో విస్తృతంగా వ్యాపారాన్ని సాగిస్తున్నారు. ఉదాహరణకు న్యూయార్కులో లార్డు అండ్ టైలర్, లండన్‌లోని హారాడ్స్ అండ్ లిబర్టీస్, కెనడాలో హాల్ట్‌రిమ్ ఫ్రీ అండ్ జీన్ పియర్స్ మొదలయిన వాట్లల్లో వీరి దుస్తులు లభిస్తున్నాయి. ఎగుమతిసంస్థ మాత్రమే సంవత్సరానికి ముప్ఫయి అయిదు లక్షలు సంపాదిస్తూంది. ఈ దుస్తుల వ్యాపారంల్లో సుమారు అయిదువేల మంది పనిచేస్తున్నారు. ఇళ్ళలో ప్రారంభించి ఫ్యాక్టరీలవరకు పనిచేసే వారున్నారు. విలువయిన దుస్తులమార్కెట్లు కుటీరపరిశ్రమల కెక్కువ విలువనిస్తాయి. జుగ్ను గ్రూపుకుచెందిన మహిళలనేకమంది ఉన్నారు. వీణా కపూర్ శారదా మాధవన్, రెడీమేడ్ దుస్తులెక్కువగా తయారుచేస్తున్నారు. యూనిఫారం దుస్తులు ఫ్యాక్టరీలలో, విద్యాలయాలలో ఉపయోగించే, ఫ్యాక్టరీలలో బాయిలర్ సూట్లు వీరు విరివిగా తయారుచేస్తున్నారు. ధరలు కూడ కొంత చవుకగా ఉండేటట్లు వీరు చూస్తున్నారు. వీరికోరకు అనేక పారిశ్రామిక వాటికలుకూడ వ్యాపారాన్ని ఆరంభించాయి. ఆ యజమానులా

వ్యాపారాన్ని క్రమంగా వారి భార్యలకు అప్పజెప్పుతున్నారు. ఈ వ్యాపారాభివృద్ధి క్రమంగా స్త్రీలకు వృత్తిని కల్పిస్తోంది. ఈ పనిని వారివారి ఇళ్ళల్లో తయారుచేసి ఇవ్వవచ్చు. ఒకొక్క పరిశ్రమదారుడు ఒక్కొక్కసారి రెండు మూడు వందల మందికి కూడ పని కల్పించవచ్చు. వందలాది మంది స్త్రీలు లేసు, ఎంబ్రాయిడరీకూడ పని చేస్తున్నారు. దేశంలో అనేక కేంద్రాలలో ఈ పని జరుగుతోంది. దక్షిణ భారతంలో కేరళ ముఖ్యంగా లంగాలేసులు, దిండు గలీబుల లేసులు తయారుచేస్తున్నారు. ఉత్తర భారతంలో షాడో వర్క్, మిర్రర్ ఎంబ్రాయిడరీ, జరీ ఎంబ్రాయిడరీలు వందలాది స్త్రీలకు వృత్తిని కల్పిస్తున్నాయి. విరామ సమయంలో వారీవిధంగా సంపాదించ గలుగుతున్నారు.

అనేకమంది స్త్రీలు పదిలోపు మిషన్లతో ఇళ్ళదగ్గరే పనిచేస్తూ, చేయిస్తూ దేశానికి కావలసిన రెడీమేడ్ దుస్తులు తయారుచేయిస్తూ సంవత్సరానికొక లక్షకు పైగా సంపాదిస్తున్నారు. లీడ్స్‌లో విద్యాగంధం లేని పంజాబీ స్త్రీ బ్రహ్మాండమయిన వ్యాపారాన్ని సాగిస్తోంది. బ్రిటన్‌లోని ఉత్తరభారత స్త్రీల నందరిని సమీకరించి స్త్రీల దుస్తులను తయారు చేయిస్తోంది. దీన్ని మించిన విచిత్రమయిన విషయం మరొకటుంది. భారతీయ సోదరీమణులిద్దరు విదేశాల్లో ఉన్నప్పుడు వివాహమూ విడాకులుకూడ పొందారు. వారికి వెనుక ఎలాంటి ఆధారం, సహాయం లేదు. కేవలం కుట్టు పనిలో వారికున్న నైపుణ్యంవల్ల న్యూయార్క్ నగరంలో చిత్రంగా పేరు ప్రఖ్యాతులు ఆర్జించారు. ప్రస్తుతం వారు ఢిల్లీనుంచి ఈ వ్యాపారాన్ని బ్రహ్మాండంగా సాగిస్తున్నారు.

చేతిపనులు పునరుద్ధరించడం, చిత్రవిచిత్రాలయిన డిజైన్లు తయారుచేసే కేంద్రాలు స్థాపించడం, వాటికి తగిన మార్కెట్లను ఏర్పరచడం మహిళల పనయింది. ఈ కృషిలో కమలాదేవి చటోపాధ్యాయ నిర్విరామ కృషి

చేసిన సుప్రసిద్ధ మహిళ. యవ్వనంలో అసాధారణమైన అందచందాలు గలిగిన ఆమె అభిరుచి ఆసక్తుల పరిధి అపారం. రాజకీయాలలో సోషలిస్టు దృక్పథానికిచెందిన ఈమె భారతీయ కళారంగంలో రంగస్థలాన్ని పునరుద్ధరించాలని కోరింది. ఎన్ని అభిరుచులున్నా అసాధారణమయిన అద్భుతకృషి ఆమె గావించిందనడం మాత్రం నిస్సంశయం.

పెయింటింగ్‌లో ఆమె కృషిఫలితాలను బొట్టికొట్టలలో, షాపుల్లో, పనిచేసే తీరుతెన్నులు పరిశీలించడానికి దేశం నలుమూలలా తిరిగి చూసింది. నిర్విరామమయిన ఆమె పయనాల్లో నశించిపోతోన్న అనేక నైపుణ్యాలు వెలుగులోకి తీసికొనిరాగలిగింది. కన్నులు మిరుమిట్లు గొలిపే అనేక రీతుల్లో ఉన్న అనంతమయిన చేతిపనులను మారుమూలలో దాగియున్న వాటిని వెలుగులోకి గొనిరాగలిగింది. జపాన్, భారతదేశాలు విస్తృత పరిధిలోను, ఇరాన్, ఫిలిప్పైన్ దేశాలు నశించిపోయే హస్తనైపుణ్యాన్ని రక్షించగలిగాయి. కళాత్మకమయిన అనేక పనులు, సృజనాత్మకమయిన కృషిని సమన్వయపరచి ఆధునిక వాణిజ్య వ్యాపార రంగాలలోకి చొప్పించుతున్నారు. జెస్లిమ్ దామెబి అనేక సంవత్సరాలు కమలాదేవితో కలిసి పనిచేసింది. ప్రస్తుతమామె ఇరాన్‌లో ఐక్యరాజ్యసమితి సలహాదారుగా ఉంది.

అనేక కష్టనష్టాల తరువాత మనకు స్వాతంత్ర్యం లభించింది. స్వాతంత్ర్యానంతరం చేతిపనులు, చేనేత పరిశ్రమలు క్రమబద్ధంగా నిర్వహింపబడి క్రమంగా వాణిజ్యం పరిశ్రమ మంత్రిత్వశాఖకు అనుబంధించబడ్డాయి. ఆ కారణంవల్ల సుస్థిరమయిన ప్రపంచ మార్కెట్ ఏర్పరచబడింది. చేతిపనులు, చేనేత వస్త్రాలు ఎగుమతిచేసే కార్పొరేషన్‌కు శ్రీమతి పుపుల్ జయకర్ అధ్యక్షురాలు. 1965లో 24 లక్షల టర్నోవర్‌తో ఆరంభించి కేవలం ఎగుమతివల్ల సంవత్సరానికి 26.5 కోట్లవరకు పెరిగింది. హాండీక్రాఫ్ట్సు, హాండ్‌లూమ్ ఎక్స్‌పోర్ట్సు కార్పొరేషన్ న్యూయార్కు,

టోక్యో, పారిస్, నైరోబి నగరాల్లో వ్యాపార కేంద్రాలు స్థాపించడంతో పాటు తివాచీలు, ఊలు అల్లిక దుస్తులు, రత్నాలు, ఆభరణాలుకూడ అధికంగా ఎగుమతిచేసి నిర్వహిస్తోంది. ఈ విధంగా పుపుల్ జయకర్ భారతీయ వస్త్రాలకున్న ఉజ్జ్వలమయిన గత చరిత్రను వెల్లడిస్తూ వాటిలో ఒక ప్రత్యేకతను సంపాదించింది. ఈ విధంగా చేనేత పరిశ్రమలనుంచి పారిశ్రామిక కోఆపరేటివ్‌లు ఏర్పరచడం వరకు వెళ్ళింది. ఈనాడామె హాండీక్రాఫ్ట్స్ బోర్డుకు అధ్యక్షురాలుకూడ. సోవియట్ రష్యా, తూర్పుయూరప్ సోషలిస్టు దేశాలతోకూడ వాణిజ్యం పెంపొందుతోంది. మన హాండీక్రాఫ్ట్స్, హాండ్‌లూమ్ ఎక్స్‌పోర్టు కార్పొరేషన్ కార్డిన్‌వంటి వారిని భారతదేశానికి రప్పించి ఆయన సంతరించే వాటిని భారతీయ నూలుగుడ్డలకుకూడ ఉపయోగింప వలసిందని కోరారు. ప్రస్తుతం ఈవ్స్‌సైంట్ లారెంటుతోను, ప్రఖ్యాత జపాను డిజైనరు కెంజోతోను సంప్రదింపులు జరుగుతున్నాయి.

అద్భుతమయిన అసాధారణ అలంకరణతోనిండిన బాతిక్కు అలంకరణతో ఉన్నదుస్తులు, చీరలు, లాంతర్లు, ప్రాచీన సామగ్రి భారతీయ నగరాల్లోకి వచ్చాయి. అందులో అధునాతనంగా, కళాత్మకంగా రూపొందించిన ఎంపోరియాన్ని నవనాగరికులయిన సునితా పీతాంబర్ నిర్వహిస్తోంది. చర్మంతో వస్తువులను తయారుచేయడంలో ప్రత్యేకతను సంపాదించడం, చేతిసంచులు, అద్దాలు, పూసలుపొదిగిన భారతీయ పాదరక్షలు మొదలైన వాటిని లండనులోని భారీ వ్యాపారులతో సంప్రదింపులు జరిపి, వాటికి ఎగుమతి చేయడంలో నిమగ్నురాలయిందామె. మదరాసులో సంగీతఛోప్రా, ఢిల్లీలో రాజసంచ, చిన్నచిన్న చర్మసామగ్రితో వ్యాపారాన్ని జయప్రదంగా నిర్వహిస్తున్నారు. ఈ విధంగా అసంఖ్యాకులయిన అతివలు దుస్తులు తయారుచేయడంవల్ల తమతమ కుటుంబ ఆదాయాన్ని పెంపొందించుకొంటున్నారు.

# ఇతరరంగాలు - స్త్రీలు

కొంతమంది భారత స్త్రీలు వ్యవసాయంలో, కోళ్ళ పరిశ్రమలో ప్రఖ్యాతిగాంచారు. అలా దిగ్విజయాన్ని సాధిస్తున్నవారిలో శ్రీమతి స్నేహా సుప్రసిద్ధురాలు. సైనికరంగంలో ఎక్స్ జనరల్ సతీమణి అయిన ఆమె తయారుచేసే వేలాది కోడిపిల్లలను పొరుగు దేశాలలో పెంచుకొనేవారికి విమానాలమీద పంపుతుంది. బొంబాయిలోని అమృతాపటేల్ ఒక సుప్రసిద్ధ వ్యవసాయకురాలు. బరోడాలోని జాతీయ పాల అభివృద్ధి సంస్థలో సభ్యురాలిగా కూడా ఉంది.

డిజైను రంగంలో గృహసామగ్రి వ్యాపారంలో లీలా శివషానర్ కర్ ఇత్తడి సామగ్రిమీద ప్రాచీన నగిషీని పునరుద్ధరించింది. చక్కని భోజనాల బల్లలు, అందమయిన అలంకరణ సామగ్రి తయారుచేయిస్తోంది. మిస్నీబోగా స్వచ్ఛమయిన కర్రతో ఆధునిక భోజనాలగది, పడకగది కూర్చొనే గదుల్లో సామగ్రిని అందాలుచిందించే స్వీయ డిజైన్లలో తయారు చేయిస్తోంది. అలంకరణకు సంబంధించిన పుష్పాతల్వార్ సౌరాష్ట్రశైలిలో అందంగా చెక్కబడి నవరత్నాల రంగుల్లో వున్న కర్రసామగ్రిని, గృహోప కరణాలను చేయిస్తోంది.

# విద్యా వైద్యరంగాలు - స్త్రీలు

స్త్రీలకు మరింత అనుకూలమైన వృత్తులుగాని ఉద్యోగాలుకాని విద్యా వైద్యరంగాల్లోనివే అని చెప్పవచ్చు. వారి మనస్తత్వానికి నర్సింగ్ కూడ తగిన వృత్తి అని చెప్పవచ్చు. సైనిక శాఖలో వైద్యరంగాన ఉన్నతోద్యోగాలలో అనేకమండి స్త్రీలున్నారు. కల్నల్, మెటిల్డాభట్ నేవీలోను, బ్రిగేడియర్ మిస్ జి.ఎ. రామ్ ఆర్మీలోను ఛీఫ్ మేట్రన్‌గాను ఉన్నారు. పురుషుల్లో సమానస్థాయిలో సమాన పరిస్థితుల్లో

మేజర్ ఫరీదా రెహనా భర్తగారు ఆర్మీ సర్జనుగా బాంగ్లాదేశంలో పని చేసే టప్పుడు ఆమెకూడ అయనతోపాటు పనిచేసింది. 1971 పాకిస్తాన్ యుద్ధ సమయంలో ఆమెకూడ చేసింది. ఈమె పేరాట్రూపర్‌గానుండడం మరొక విశేషం. గౌరవప్రదం. ఆకాశంలోనికి చొచ్చుకొనిపోయి పేరాట్రూపులను 1975 నవంబరులో ఆగ్రాపై ప్రదర్శించడంలో పాల్గొన్న ఏకైక మహిళా మణి. ఎయిర్‌పోర్టులో పయిలెట్‌గా సంపూర్ణ అర్హతలను కలిగియున్న ప్రేమమథునుగురించి కొన్ని సంవత్సరాలక్రితం కొంచెమాలోచించారుగాని తరువాత తోసివేశారు. ఈనాడు డి. బెనర్జీ భారత వైమానిక సర్వీసులో వ్యాపారరంగంలో పైలట్‌గా ఉన్నారు. సివిల్ ఏవియేషన్‌లో స్త్రీలు సంప్ర దాయంగా వచ్చే ఎయిర్ హోస్టెస్సులుగా తమ స్థానాన్ని అధిక సంఖ్యలో నిలుపుకొంటున్నారు. అనేకమంది బాలికలు హోటల్ నిర్వహణలో రిసెప్ష నిష్టులుగా, స్టోరుకీపర్లుగా శిక్షణ పొందుతున్నారు. ఇంతజరుగుస్నా సంపూర్ణ స్వతంత్రంతో హోటల్ నిర్వహించే మహిళ రాలేదు.

ఈమధ్య అసాధారణమయిన అనేకవృత్తులు స్త్రీలనుఆకర్షిస్తున్నాయి. 1971 లెఖ్ఖలు వారి వృత్తులనమూనాను వెల్లడిస్తున్నాయి. వాటినిబట్టి 23,800 మందిస్త్రీలు వైద్యరంగంలో, శస్త్రచికిత్సావిభాగంలోను, 2500మంది సాంకే తిక రంగంలో, ఇంజనీరింగు శాఖలోను, 300మంది వైమానిక రంగంలోను నావికారంగంలో ఓడమీద ఆఫీసర్లుగాను, 1700 మంది న్యాయవాదులుగాను, 5500 మంద అడ్మినిస్ట్రేటివ్, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లుగాను, 16000 మంది సాంఘికశాస్త్రవేత్తలుగాను, 5300 మంది వాణిజ్యరంగంలో మేనేజర్లుగాను, యజమానులుగాను వ్యవహరిస్తున్నారు. మొత్తం వృత్తుల పరిధికిది ఒక ప్రాతినిధ్యం కాకపోయినప్పటికీ స్త్రీలు పనిచేసే వివిధరంగాలలో వారి ప్రాతి నిధ్యానికి ఇదొక మచ్చుతునకగా ఉన్నదనిమాత్రం చెప్పగలం.

విద్యారంగంలో విఖ్యాతివహించిన విదుషీమణు లనేకులున్నారు. వానిలో సులభ పనిందికర్ కొంతకాలం ఇనస్పెక్టర్‌గా ఉన్నారు. ఆమె జాతీయ విద్యాకమిటీలో సభ్యురాలుగాను, కేంద్ర రెవెన్యూ విద్యాబోర్డుకు

అధ్యక్షురాలుగాను ఉన్నది. N.C.E.R.T లో కూడ ఆమె ప్రముఖ సభ్యురాలు. మదరాసు పురుషుల కళాశాల ప్రిన్సిపాలుగా సుభా పార్థసారధి ఉన్నారు. ఆంధ్రలో పురుషుల కళాశాలకొకప్పుడు శ్రీమతి. వసుంధర్ ప్రిన్సిపాలుగానున్నారు. ప్రస్తుతం ఏంజిలా సెల్మన్ పురుషుల కళాశాలకు (వి. ఆర్. ఎస్. కళాశాల, తెనాలి) ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. శ్రీమతి సుభద్రా దేవి, డా॥ శ్రీమతి సత్యభామారెడ్డి, డా॥ కామేశ్వరిగార్లు కూడ ప్రిన్సిపాల్ పదవిని నిర్వహించారు. బరోడా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షురాలిగా విఖ్యాతి నార్జించింది. పూనాలోని భారతీయమహిళా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షురాలిగా శారదా మెహతా ఉన్నారు. కలకత్తాలో రవీంద్రుని విశ్వభారతికి రోమాచౌదరి ఉపాధ్యక్షురాలుగా ఉన్నారు. బొంబాయి. S N D.T మహిళా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షపదవిని శారదావిహాను నుంచి మాధురీ జెన్ గ్రహించింది. కమిలినీ భాన్స్లే రిజిస్ట్రారుగా ఉన్నారు. వంగదేశంలో లీలా మంజుదారు. మహారాష్ట్ర విద్యాశాఖ డైరెక్టర్‌గా చిత్రానాయక్‌లు ఉన్నారు. చిత్రానాయక్ స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ డైరెక్టర్‌గా కూడా ఉన్నారు. కామరణదివే సాంస్కృతిక పరిశోధనా సంస్థ డైరెక్టరుగా మహారాష్ట్రలో పని చేస్తున్నారు. బొంబాయి విశ్వవిద్యాలయంలో కమాల్‌పుడ్, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో కృష్ణా భరద్వాజ్, ఢిల్లీ విశ్వవిద్యాలయంలో దేవకీజైన్ ధర్మకుమార్ ఆర్థిక శాస్త్రవేత్తలుగా బహుళ విఖ్యాతినార్జించారు. 'కామన్ మార్కెట్' అనే గ్రంథంవల్లకూడ ఆమె ప్రసిద్ధిగాంచింది. దేవకీ జైన్ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఆమె రచించిన 'భారతస్త్రీలు' అనే గ్రంథంవల్ల ప్రఖ్యాతి వహించారు.

శాస్త్రీయ రంగంలో ప్రఖ్యాతి వహించిన మహిళ డా॥ అషిమాఛటర్జీ. కలకత్తా అంతర్జాతీయ అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. ఆ సంవత్సరం వాల్తేరులో జరిగిన సైన్స్ కాంగ్రెసులో కూడ సన్మానింపబడ్డ శాస్త్రవేత్త.

# న్యాయవాద రంగం - స్త్రీలు

న్యాయ శాస్త్రాన్ని అభిమానించిన అతివలు అరుదనే చెప్పాలి. అయినప్పటికీ ఆ రంగంలోకూడ కొరతలేదు. లీలాసేన్ సుప్రీమ్ కోర్టులో న్యాయవాదిగా పేరుప్రఖ్యాతులు వహించిన మహిళ, శ్యామలా పప్పును స్పెషల్ స్టాండింగ్ కౌన్సిల్‌లో సీనియర్ న్యాయవాదినిగా నియమించారు. కామన్వెల్తు అంతటిలో సీనియర్ న్యాయవాదినిగా ప్రాక్టీస్‌చేస్తున్న ఏకైక మహిళ శ్యామల. మిధిమ్‌లామ్ అనే ప్రథమశ్రేణి న్యాయవాదిని బొంబాయిలో ప్రాక్టీసుచేస్తోంది. ఢిల్లీ విశ్వవిద్యాలయ లా కళాశాలలో డీన్ పదవిని లలితా సర్కార్ ఇటీవల త్యజించింది. ఆమె న్యాయశాస్త్ర విభాగంలో ప్రముఖులు. స్త్రీల స్థాయి సంఘ విషయసేకరణలో ప్రముఖపాత్ర వహించిన మహిళామణి. పదిహేనువందల పేజీలయిన ఆ విషయసేకరణ సంచికకు ప్రధాన సభ్యురాలుగా వహించింది వీణా మంజుదార్.

ఆంధ్రలోకూడ శ్రీమతి మంగళాంబ, శ్రీమతి కోటమ్మరెడ్డి న్యాయాధిపతులుగా ఉన్నారు. శ్రీమతి అమరేశ్వరి ప్రప్రథమ హైకోర్టు జస్టీస్‌గా నియమించబడ్డ ఆంధ్రమహిళ. ప్రసన్నకుమారి లక్ష్మిదేవిగార్లుకూడ హైకోర్టు వకీళ్ళుగా ఉన్నారు. అనేకమంది ఇతరపట్టణాలలో పనిచేస్తున్నప్పటికీ వీరి సంఖ్య తక్కువగానే ఉంది.

# వైద్యరంగం - స్త్రీలు

ఇందిరా అమ్మ, మైసూరు వైద్యకళాశాల ప్రిన్సిపాలు. ఢిల్లీలో ప్రసిద్ధిగాంచిన ఆరు వైద్యకళాశాలల్లో ఆర్థోపెడిక్ విభాగాధిపతులుగా స్త్రీలున్నారు. వారిలో డా॥ పద్మావతి మౌలానా అజాద్ కళాశాల డైరెక్టరు. 1956లో కేరళదేశీయురాలు మేరీపూనన్ ప్రప్రథమ మహిళాసర్జన్‌జనరల్. భారతదేశ వైద్యరంగంలో అధ్యాపక విద్యార్థిబృందం మొత్తంలో నూటికి 20 నుంచి 25 శాతం వరకు స్త్రీలున్నట్లుగా అంచనా వేయబడింది.

డా॥ ఎన్. పద్మావతి భారతీయ మెడికల్ సైన్సుకు అధ్యక్షురాలై విశేష గౌరవమర్యాదలను ఆర్జించింది. అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో బయోమెడిసన్‌లో అవార్డులుపొందిన పన్నెండుమంది శాస్త్రజ్ఞుల్లో అయిదుగురు మహిళలున్నారు. డా॥ కె. ఎమ్. పద్రీ, పూనా, డా॥ గఫూరున్నీసా, హైదరాబాద్, డా॥ సుజాత దస్తీదార్, కలకత్తా, డా॥ నందినీ అనిల్‌సేథ్, బొంబాయి, డా॥ ఎస్. పద్మావతి, ఢిల్లీ.

హైదరాబాదు న్యూట్రిషన్ సంస్థలో డా॥ కమలా ఎస్. జయరావు సరయిన పౌష్టికాహారం లభించని పేదపిల్లలకోసం ఒక నూతన పదార్థాన్ని కనుక్కొంది. ఆ పిల్లల హార్మోనులు సరయిన స్థితిలో ఉంచడానికాపదార్థం ఉపయోగపడుతుంది. ఆమె కనుక్కొన్న ఆ పదార్థానిక్కావలసిన సిద్ధాంతం ఈనాడున్న సిద్ధాంతాలను తీవ్రతరంగా మార్చివేయవచ్చు.

# కళారంగం - స్త్రీలు

కళారంగంలో ప్రధానంగా సంగీతంలో స్త్రీలదే పైచేయి కావచ్చు. దానితోపాటు భరతశాస్త్రం, ప్లాస్టిక్ ఆర్ట్సులోకూడ స్త్రీలు ముందంజ వేస్తున్నారు. ఆర్కిటెక్చర్, పెయింటింగుల్లో అంతగా లేరని చెప్పవచ్చు. అలంకరణా రంగంలో ప్రఖ్యాతి వహించిన శ్రీమతి రత్నాబాయి ఇటీవల అకాల మరణంతో అంతరించింది. ఆమె పని ఎక్స్పో న్యూయార్కులో ప్రఖ్యాతి గాంచింది. జపాన్‌లో ఒకాసా, మాంట్రియల్‌ల్లో కూడ ఆ పని ప్రఖ్యాతి గాంచింది. అలంకరణారంగంలో తరచు ప్రభుత్వమామెకు ఆహ్వానాలు పంపుతూండేది. ఛండీఘర్ మ్యూజియంలో ఆమె అలంకరణ అపూర్వం అనాలి. గృహాంతర్భాగాలంకరణ, ఆర్కిటెక్చర్, ఇటీవలకాలంలో అనేక మంది మహిళల నాకర్షిస్తున్నాయి. ఢిల్లీలో భారతీయ పొగాకు కంపెనీకి చెందిన నూతన హోటల్ అలంకరించడానికి కిరణ్ ధిల్లాను ఇటీవల ఆహ్వా

నించారు. సీనా కౌలు కుటీర పరిశ్రమల ఉత్పత్తిని ప్రదర్శించి అమ్మే ఎంపోరియాలను అలంకరించడానికి, అమర్చడానికి ప్రత్యేకంగా సంవత్సరాల తరబడి ఆహ్వానింపబడుతూనేవుంది. ఆపనిని ఆమె నిర్వహిస్తూనే ఉంది. ఆ రంగంలో ఆమెకున్న ప్రజ్ఞాప్రాభవాలు అద్వితీయాలు. భారతీయ జానపద కళలు ఊహాజనితాలయినా తగినరీతులకవి ఎంతటి అవకాశమైనా అందించగలవు. బీహార్‌లో మధువాణి పెయింటింగులు పునరుద్ధరించి ప్రఖ్యాతి వహించినది ఒక గ్రామీణ మహిళ. ఆ ప్రకటనా పెయింటింగులకు ఫ్రాన్సుదేశంలో విపరీతమయిన ఆసక్తి, అభిరుచులు లభిస్తున్నాయి. అందువల్ల అక్కడనుంచి అంతులేని ఆర్డర్లు వస్తున్నాయి. డిజైను రూపొందించడంలో పెయింటింగులో వాటిని ప్రదర్శించడంలోను సుశీలారామ్ ప్రజ్ఞాప్రాభవాలు అసాధారణాలు. సిరామిక్సులో ప్రమీలాపండిట్, బొంబాయినుంచి కిరణ్ గుజ్రాల్ సుప్రసిద్ధులు. కిరణ్ భర్తగారు సుప్రసిద్ధ చిత్రకారుడు. భవనాల ముందుభాగాలనుగాని, వెనుకభాగాల దృశ్యాలనుగాని అద్వితీయంగా చిత్రించగల సమర్థుడు. అది ఒక వినూత్న కళ. దానిలో కిరణ్ ఆయనకు ఎంతో సహాయ సహకారాల నిస్తుంది. నేత మరొక వినూత్నరీతిలో ఉన్న కళాత్మక క్రియ. దానిలో నెల్లీ సేత్నా సుప్రసిద్ధురాలు. సుందరతరమయిన ఆమె గోడ అలంకరణలకు ఉపయోగపడే దృశ్యాలు విశేషఖ్యాతి నార్జించాయి. ఢిల్లీలో మృణాల్ ముఖర్జీ శిల్పానికి ప్రఖ్యాతి వహించింది. అసాధారణమైన శిల్పరంగంలో సూను ఫోచర్ లోహపుపని సుప్రసిద్ధమైంది.

చిత్రలేఖనంలో దేశమంతటా ప్రదర్శనలు ఏర్పాటు చేయడంలో ప్రసిద్ధిగాంచిన మహిళలనేకులు ఉన్నారు. అమృత షేర్‌గిల్ అందాలరాశి. అపారమయిన తృష్ణతో చిత్రాలురాసే ఈ యువతి ఇరవయ్యేళ్ళ ప్రాయంలోనే మృత్యువాత బడటం దురదృష్టకరం. ఢిల్లీలో మోడరన్ ఆర్ట్సు మ్యూజియంలో 'దారిద్ర్యం', 'సౌందర్యం' అనే ఆమె చిత్రాలు

ఉన్నాయి. ఇటీవల కాలంలో ప్రఖ్యాతి వహిస్తున్న యువ కళాకారిణుల్లో జరీనా హాష్మీ ఒకరు. ఈమె చేసే బ్రిక్ పని అందం వర్ణింప నలవి కాద నడం అతిశయోక్తి కాదేమో: బిల్‌క్విస్‌లతీఫ్ పెయింటింగులో కూడ ప్రతిభావంతురాలు. ఉన్నత శ్రేణికి చెందిన మహిళామణి. అంజోలీ ఇలా మీనన్ బైజాన్‌టైను స్కూలుకు చెందిన శైలిలో చిత్రిస్తూ ఆ రకపు పనిని పునరుద్ధరించింది. సున్నితంగా డిజైనుచేయబడ్డ లితోగ్రాఫులతో కూడినది మేడయాన్ పని. దీనితోపాటు మనుష్యుల చిత్రాలను సజీవంగా చిత్రించ గలిగిన నేర్పరి: నాగజైనులను అందంగా అలరారే రీతిలో రూపొందించ గల ప్రతిభ, సమర్థత గలిగిన డోలీ సాహియత్, 'మీర్' సంస్థకు అనేక సంవత్సరాలు డైరెక్టరుగా ఉంది. ప్రేమాచావరీ, దమయంతీ భావలా, దేవయాని కృష్ణ ఈ రంగంలో సుప్రసిద్ధులు. బాటిక్ అలంకరణలో జయా అప్పలస్వామి సుప్రసిద్ధురాలు.

వీరిలో జరీనావారి భర్తగారు ఐక్యరాజ్యసమితిలో డిప్లొమాట్. బిల్‌క్విస్‌లతీఫ్ భర్తగారు వైమానిక దళంలో ఎయిర్ మార్షల్ ఛీఫ్. అంజోలీ మీనన్ భర్తగారు నౌకాదళంలో కమాండర్. భర్తలు ఒకచోట నుంచి మరోచోటుకు మారినప్పుడు కదలవలసివస్తుంది. ఐనా వారిలో సృజ నాత్మక శక్తిని, కార్యక్రమాలను కొంచెంకూడ వారు తగ్గనీయరు.

ఫిల్మ్ ప్రొడ్యూసరు సత్యవతీమణి శ్యామాజైదీ రంగుల ఎన్నిక డిజైను కూడ సంచలనాత్మకమయింపని చెప్పాలి. వారి ఫిల్మ్ 'గరమ్ హవా' నిండా దుస్తుల ఎంపిక నాటక ఫలితాన్ని ఉన్నత పథానికెత్తడాని కుపయోగపడి సతీపతులకు ఎనలేని ఖ్యాతిని తెచ్చిపెట్టింది. ఆమె తల్లి ఖుద్సియా జైదీ హిందూస్థానీ థియేటరు కనిపెట్టిన మహిళామణి. 'శమ' కూడ దుస్తులు, రంగస్థల డిజైన్లలో బహుకాల అనుభవం గడించింది. రంగుల ఎంపికలో ఆమెకున్న పరిజ్ఞానం మరింతగా దాన్ని రాణింపజేసింది

శాస్త్రీయ నృత్య సంగీతాల్లో కూడ స్త్రీలు పురుషులను మించి పోయారు. ఫిల్ము పాటల్లో వీరు ప్రపంచ ఖ్యాతిని ఆర్జించారు. ముప్ఫయి సంవత్సరాల క్రిందట శాస్త్రీయ నాట్యంలో బాలసరస్వతి అగ్రగణ్యురాలని పేర్గాంచింది. రుక్మిణీ అరండేలు కూడ ఈ రంగంలో అద్వితీయ ప్రజ్ఞా ప్రాభవాలు కలిగిన మహిళ. ప్రధానంగా నృత్యరంగాన భరతనాట్యంలో. అందుకే ఆమెకు రాజ్యసభ సభ్యత్వమిచ్చి భారత ప్రభుత్వం ఆమెను సత్కరించింది. లలిత మనోహరమయిన ఈ ప్రాచీన కళను పునరుద్ధరించుటకు ఆమె అడయారులో కళాక్షేత్రాన్ని ప్రప్రథమంగా స్థాపించారు. థియసాఫికల్ కేంద్రంలోనే ఆ క్షేత్రాన్ని ఆరంభించింది. ఆ కేంద్రం అంతకు ముందు అనేక సంవత్సరాల క్రిందట ఆనీబిసెంటు చేత ఆరంభించబడింది. జిడ్డు కృష్ణమూర్తిగారిచేత ప్రసిద్ధ గాంచింది. మేడమ్ మరియా మాంటిసోరి తమ బాలల శిక్షణా కేంద్రం కూడ భారతదేశంలో ప్రప్రథమంగా ఇక్కడే ప్రారంభించింది.

1940–50 సంవత్సరాలలో శాంతారావు నాట్యంలో అగ్రగణ్యురాలని నిపుణులు భావించారు. ఆసక్తిదాయకమయిన ప్రాచీన నాట్యకళల్లో మోహిని అనే రీతిని ఆమె పునరుద్ధరించింది. ఈ రంగంలో చెప్పుకోదగిన మహాక సుప్రసిద్ధ నర్తకి మృణాళిని సారాబాయి. 'దర్పణ' అనే నృత్య కేంద్రాన్ని ఈమె స్థాపించింది. ఈ కేంద్రం అలహాబాదులో స్థాపించబడ్డ కళాకేంద్రం. కేవలం మృణాళిని, ఆమె భర్త గారయిన సుప్రసిద్ధ అణు శాస్త్రవేత్త డాక్టర్ విక్రమ్ సారాబాయ్ గార్లతో స్థాపించబడింది. భారత అణుశాస్త్ర కమీషన్‌కు ఆయన అధ్యక్షులుగాఉండి అకాలంగా మరణించారు.

ఢిల్లీలో కళాకేంద్రాన్ని స్థాపించడంలో సుమిత్రా చరితరామ్ బాధ్యురాలు. ఇది ఉత్తర హిందూస్థానీ సంగీతానికి, కథక్ నృత్యానికీ కేంద్రం, నీలిమాదేవి దీనిని నిర్వహిస్తున్నారు. ఆమె గొప్ప గాయనికూడ. ఆ కళకు

ఇంచుమించు ఆమె ఆద్యురాలని చెప్పవచ్చు. గొప్ప కళాపోషకురాలు. 'త్రివేణి' అనే కళాకేంద్రం నడుపుతుంది.

ఒక థియేటర్, లెక్చర్ హాలు, నృత్యకళాకేంద్రం ఉన్నాయందులో. మణిపూరి శాస్త్రీయ నృత్యంతో ప్రత్యేక శిక్షణ, సంగీత శిక్షణకూడ ఉన్నాయి. పేరొక కేంద్రం మాధురీ దేశాయ్‌తో స్థాపింపబడింది. భారతీయ కళలకు అవకాశమిచ్చి, స్టూడియోలు, హాల్సు, థియేటరు గల్గియుంటె ప్రాచీన భారతీయ కళలను ప్రోత్సహించే మనోజ్ఞమయిన కేంద్రమిది. ఈ మాధురీ దేశాయ్ మాజీ డిప్లొమాట్ వితంతువు. ఈ కేంద్రం ఆమె మామ గారయిన భూలాభాయ్ దేశాయిగారి పేరుమీద ఉంది. ఆయన సుప్రసిద్ధ బారిస్టరు. సుప్రసిద్ధురాలయిన లీలావతి మున్షీ వేరొక కళాకేంద్రాన్ని స్థాపించింది. మున్షీగారి హస్తంకూడ అందులో ఉంది. అందులో కళలను పరిశీలించి పరిశోధించే అవకాశాలతోపాటు, థియేటరు, లెక్చర్ హాల్సు, మొదలయిన సర్వ అవకాశాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఢిల్లీ, బొంబాయిల్లో ఉన్న భారతీయ విద్యాభవనాలు ఉన్నతోన్నత పరిశోధనాలయాలుగా విరాజిల్లుతూ ఉన్నాయి. వాటిల్లో ఉన్న గ్రంథాలు పరిశోధకుల అవసరాల నెంతగానో తీర్చగలుగుతాయి. ప్రధానంగా సంస్కృత గ్రంథాలు గణియించాలని చెప్ప వచ్చు.

స్వయంగా కళాకేంద్రాలను నెలకొల్పిన నృత్య కళాకారులు అనేక మంది ఉన్నారు. ఆధునిక యుగారంభంలో 'సితారా' అనే ఒక కథక్ నృత్య కళాకారిణి ఉండేది. ఆమె ఒకప్పుడు 48 గంటలు ఏకబిగిని విశ్రాంతిగా నృత్యం చేసిందట. ఫిల్ము ప్రపంచంలో ఒక గొప్ప ఆకర్షణను సృష్టించిన సుప్రసిద్ధురాలు. యామినీ కృష్ణమూర్తి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆధునిక కూచిపూడి, ఒడిస్సీ నృత్యకళాకారిణి ప్రధానంగా భరత నాట్యాన్ని అసలు రూపంలో ప్రదర్శించగలిగే నేర్పరి. ఇంద్రాణి రెహమాన్ కూడ కూచిపూడి

నృత్యాన్ని నవరూపంలో ప్రదర్శిస్తూంది. వై జయంతిమాల రంగస్థలంమీద, ఫిల్ము ప్రపంచంలో కూడ మంచి ప్రతిభ కలిగిన కళాకారిణి. హేమామాలిని కూడ యూపద్వారా ఖ్యాతిని ఈ రంగంలో సాధించగలిగిన ప్రజ్ఞావంతురాలు. అందుచేతనే వీరు అంతగా ఆకర్షించారు, ఆకర్షించగలుగుతున్నారు. పద్మిని పేరుకూడ ఈ రంగంలో మరువరానిది. 1940 లో బయటకు వచ్చి నాట్య రంగంలో అపారమయిన పేరు ప్రఖ్యాతుల నార్జించగలిగిన కళాకారిణి. కమలాలక్ష్మణి. ఈమె తన మంజులమనోజ్ఞ నృత్యరీతుల్లో ప్రేక్షకులను ముగ్ధులను చేయగల్గింది. ఉత్తర హిందూస్థాన్ నృత్యకళాకారుల్లో సోనర్ మన్సింగ్ తగినంత కీర్తిప్రతిష్టలు పొందింది. ఇటీవల ఢిల్లీలో ఒకప్రదర్శన కూడ ఇచ్చింది. ఆ తరువాత జర్మనీలో కారు ప్రమాదంలో మరణించింది.

సంగీత కచ్చేరి చేసేవారిలో సుప్రసిద్ధులు, అగ్రగణ్యులు శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిగారు. దక్షిణ భారతంలో ఎన్నదగిన ఆమె. లక్నో నుంచి అక్తార్ బేగమ్ పేరుగాంచింది. లతామంగేష్కర్ ఫిల్ము సంగీతంలో ప్లేబాక్ గాయనిగా అద్వితీయురాలని చెప్పవచ్చు. ఆమె కోకిల స్వరాన్ని అనేకమంది నాయకీమణులకు అరువిచ్చిన గానకోకిల. ఇంకా యిస్తూనే ఉంది. వాద్యసంగీతంలో అగ్రశ్రేణిని చేరిన అతివల సంఖ్య అరుదని చెప్పవచ్చు. షరన్‌రాణీ సరోద్ వాయిద్యంలో కచ్చేరీలు చేస్తుంది. ఆ కచ్చేరీలకు ప్రజలసంఖ్యాకులుగా వెళుతూ ఉంటారు.

ఆధునిక బాలికలు శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకొనేవారు వాన్ని వీడడం లేదు. ఉషా అయ్యర్ ఆమె సోదరి కెబేరా నృత్యాని కంగీకరించి నపుడు ఎంతో దుష్ప్రచారానికి లోనయ్యారు. వీరిద్దరు అరోరా హోటల్లో రాత్రిపూట భోజన సమయాల్లో నృత్యం చేయడాని కంగీకరించారు. అనేక మంది వీరిని తరువాత అనుసరించారు. ఆ జీవనం దుష్ప్రచారాని కాలవాల

మైన జీవనం. అది భారతీయ సంస్కృతికి, సంప్రదాయానికి, సభ్యతకు భిన్నమయిన జీవనం.

తరువాత మోడలింగ్. దీనికి కెబెరా నృత్యాని కంటె కొంత గౌరవ స్థానం ఉంది. అందమయిన నవ యువతీమణులు దీనిలో అగ్రశ్రేణిలో ఉన్నారు. వారు కేవలం కొన్ని అధునాతనమయిన రీతులను ప్రదర్శిస్తారు. అలా కొంతమంది ప్రముఖులకు వారి వారి దుస్తులను – వస్తువులను ప్రదర్శించి ప్రచారం చేయడాని కుపయోగపడతారు. దానికోసమే వారు వారిని నియమిస్తారు. ఆధునిక యుగంలో ఇతర దేశాలనేకాలలో అది ఒక గౌరవ నీయమయిన వృత్తిగా భావించబడి యువతీమణు లనేకులు దానిని స్వీకరిస్తు న్నారు. పెర్సిస్ కంబాటా, కేటీ మీర్జాలు మోడలింగ్‌లో అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించడమే గాక బ్రిటిష్ ఫిల్ముల్లో కూడ నటించారు.

అన్ని పరిశ్రమల కంటే సినిమా పరిశ్రమలో మహిళ లధికంగా ఉన్నారు. వంగదేశాన అరుంధతీదేవి, దక్షిణ భారతాన భానుమతీ రామకృష్ణ మొట్టమొదటగా ఫిల్ము దర్శకురాండ్రగా దిగ్విజయాన్ని గాంచిన మహిళా మణులు. ప్రస్తుతం విజయనిర్మల ప్రతిభావంతంగా దర్శకత్వం వహిస్తోంది. తెలుగు సినీ రంగంలో భారత దేశంలో ప్రప్రథమ ఫిల్ము నిర్మాత అయిన మహిళ ఫాతిమా బేగమ్. ఆమె 1924 లో మొట్టమొదట ఫిల్ము నిర్మిం చింది. ఠాగూరు కుటుంబానికిచెందిన దేవికారాణి సుప్రసిద్ధ ఫిల్మునాయికమణిగా పేర్గాంచింది. తొలి రోజుల్లోనే ఆమె తన సొంత ఫిల్ము కంపెనిని ప్రారం భించింది. ఆ సంస్థే బోంబేటాకీసు. ఆమె అద్వితీయమయిన అందాలరాశి. రష్యన్ చిత్రకారుడు రోరిచ్‌ను వివాహమాడింది. వివాహానంతరం ఆయన చిత్రాలను ప్రదర్శించడంలోనే జీవితం గడప నారంభించింది. ఆ ప్రదర్శనలు సోవియట్ భూమిలో రెండు దిగ్విజయాలను సాధించాయి. 1933 లో శ్రీమతి. నారాయణ ప్రప్రథమ రికార్డిస్టు అని చెప్పాలి. షమీహుస్సేన్

మరొక అద్భుతమయిన యువ నిర్మాత. ఆమె కృషి అసాధారణమయిందని అంటారు.

స్త్రీలలో నటీమణులు వరుసగా పెంపొందుతున్నారు. పూనా ఫిల్మ్ సంస్థలో అనేకమంది శిక్షణ పొందుతున్నారు. అభిరుచి, ఆసక్తి కలిగిన వారు. దానితో అనేకమంది నూతన నటీమణులు రూపొందుతున్నారు. వారితో పాటు వెనుకనుంచీ రాణిస్తున్నవారు కూడ అనేకమంది ఉన్నారు. నిరుప రాయ్‌ని గుజరాత్ ప్రాంతాన వెండితెర దేవతగా కొలుస్తారు. ఆమెలేని పౌరాణిక సినిమా లుండవని చెప్పవచ్చు. ముఖ్యపాత్రధారులుగా కులదీప్ కౌర్, షీలారమణి, రేఖ, పర్వీన్‌బాబి, జీనత్ అమన్, బిందు మొదలయిన వారు ఉత్తర భారత హిందీ ప్రపంచంలో వెలుగొందుతున్నారు.

నర్గీస్ మహా నటీమణి. వహీదా, సుచిత్రాసేన్, కమలా బెనర్జీ మొద లయినవారు అంతర్జాతీయ అవార్డు లందుకొన్నారు. వంగ దేశాన్నుంచి సుచిత్రాసేన్ అద్వితీయ ప్రతిభా పాటవాలను గలిగిన నారీమణి. నర్గీస్ బహుకాలం బొంబాయి ఫిల్ముల్లో నటించింది మీనాకుమారి మరణానంతరం ఆమెగాథ పురాణగాథగా మారింది. అంతటి మహానటి అన్నమాట స్వయంగా ఆమె కవయిత్రి. ఆమె నటన కోట్లాది భారతీయుల హృదయా లను కదల్చివేసింది. దక్షిణ భారతా నటి శారద. రెండుసార్లు "ఊర్వశి" అవార్డు గెల్చుకోగలిగిన అసాధారణ ప్రజ్ఞాప్రాభవాలు గలిగిన మహానటి. కన్నడ, మళయాళ, తమిళ, తెలుగు, హిందీ భాషల్లోకూడ అద్భుతంగా, అద్వితీయంగా నటించగలిగిన మేటి నటీమణి.

మెహతాబ్, దుర్గాఖోటె, నాదిరా, రూబీ మేయర్సు మూగ సినిమాల నుంచి టాకీలలోకి వచ్చారు. ఇటీవల నాదిరా 'జోరీ'అనే చిత్రంలో తల్లి పాత్రలో అద్భుతంగా నటించింది. యువ ప్రేమలోని కష్టసుఖాలను వ్యక్త

పరచగల ఆంగ్లోయిండియన్ కుటుంబ గాథ అది. అంతకుముందు వచ్చిన అలాటి కథ బాబీ. దానితో డింపుల్ కపాడియా తారాపథాని కెగసింది. పాత ఫిల్ముల్లోని నిజమయిన అందాలరాణులు జయశ్రీ శాంతారామ్, నవీన్‌బాను, వీణా, బీనారాయ్, నశీమ్, శోభనా సమ్రుత్ మొదలయినవారు. అభిరుచులు మారవచ్చు. శాంతా ఆప్టే ఎలాంటి పాత్రనయినా అవలీలగా ధైర్యంగా స్వీకరించి చేసేదంటారు. ఈనాడు ఆ కోవకు చెందిన నటీమణి శర్మిలా ఠాగూరు. ఈనాడు వెండితెర రాణులుగా చెలాయించేవారు. జయభాదురీ, హేమమాలిని, రాఖీ, సైరాబాను, దక్షిణ భారతంలో సావిత్రి, (తెర మరుగయింది ఇంచు మించు) జమున, శారద, వాణిశ్రీ, జయప్రద, జయచిత్ర, జయసుధ, శ్రీదేవి మొదలయినవారు - పెద్దల్లో అంజలి, వరలక్ష్మి, జి. సావిత్రి, కృష్ణకుమారులు. గయ్యాళి తనంలో సూర్యకాంతం, ఛాయాదేవి ప్రేక్షకుల నానందపరుస్తున్నారు. హాస్యరస పోషణలో రమాప్రభ తెలుగు సినీ రంగంలో రాణిస్తున్నారు.

ఆకర్షణీయం కాని వృత్తుల్లోఉన్న ఉద్యోగినుల సమస్య పురుషులతో పాటు వారి పరిధిలోకి చొచ్చుకుపోయింది. వీరితోపాటు పనిచేయడంవల్ల నూతనంగా వారెదుర్కోవలసిన సమస్య లనేకాలు బయలుదేరాయి. స్త్రీలతో కలిసి పనిచేయడం ఎరగని పురుషులు కొందరు వారిని చూచిన వెంటనే జలగల్లాగ పీడించ నారంభించారు. వాస్తవానికలా చెప్పడం న్యాయంకాదు. కాని మగవారి ఆఫీసుల్లో పనిచేసే బాలికల దుర్భర పరిస్థితులను గమనించినపుడు ఆ భావం ప్రకటితమవుతోంది. కొంచెమందంగా ఉన్న యువతిని చూసినప్పుడు పురుషుడు తటస్థంగా ఉండడం అరుదు. ఎప్పుడో ఒకప్పుడు కొంత అవాంఛనీయ ప్రవర్తన బయటపడుతూ ఉంటుంది. ఉద్యోగంచేసే స్త్రీలను సులభంగా నిందించే ప్రజాబాహుళ్యం వారిపై అనవసర దుష్ప్రచారం చేయడానికి వెనుకాడదు. ఇన్నిటినీ ఎదుర్కొని పనిచేయడం కష్టతరం. కాని పరిస్థితులవల్ల అనేకమంది వాటిని తట్టుకొని

తాము ఎదుర్కొంటున్న సమస్యలను సులభంగా తెలివిగా పరిష్కరించు కొంటూ ముందంజ వేస్తున్నారు.

ఇలాంటి పరిస్థితుల్లో స్త్రీలు ఉద్యోగాలను నిలబెట్టుకొని, నిర్వహించడం కష్టతరం. ఎవరు వీరిపై పగబట్టినా నీలాపనిందలను వేయడానికి జంకరు-బొంకరు. తమకుకూడ భార్యా, పిల్లలు, తల్లులు ఉన్నారనే సత్యాన్ని సంపూర్ణంగా మరచిపోతారు. ఎలాంటి దారుణమయిన కథల నయినా అల్లగలుగుతారు. ఆనందిస్తారు. ఇది మానవ ప్రకృతిలో కనబడే విచిత్రం. ఈ పరిస్థితుల్లో గృహిణిగా, ఉద్యోగినిగా, ద్వివిధాలయిన పాత్రలను సమర్థవంతంగా నిర్వహించడం సామాన్యమయిన విషయం కాదు. అది నిర్వహించే వారికి మాత్రమే తెలిసే విషయం. దాని కవసరమయిన మానసిక పరిణతి, మానసికంగా సరితూగు స్థాయి, ప్రతివారికి లభ్యంకావు. అనేక కుటుంబాలు ఈ రెండింటిలో చిక్కుకొని మానసికంగా సరియయిన సమాన స్థాయి గోల్పోయి సంసారాలు విచ్ఛిన్నాలయిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. కాని అదృష్టవశాత్తు అలాంటి సంఘటనలు అరుదు అని చెప్పాలి. ఉద్యోగాలు చేసే స్త్రీలు అనేకమంది వారి మానసిక స్థాయిని సమానంగా ఉంచుకొని కుటుంబాలను చక్కగా సమర్థించుకొంటున్నారు. ఇందిరాగాంధీ చెప్పిన ఒక విషయాన్ని ఈ సందర్భంలో స్మరణకు తెచ్చుకో వచ్చు. "పనిచేసిన కొద్దీ మనం దానిని బాగా చేయగలుగుతాం" అని. ఇదీ ఆమె చెప్పిన విషయం.

"అనగననగ రాగమతిశయిల్లుచునుండు." అనే సూక్తి సుప్రసిద్ధం గదా ! భారత స్త్రీలు ఈ సూక్తిని అక్షరాలా నిజమని నిరూపిస్తున్నారు.

పట్టణాలలో స్త్రీలు ఉద్యోగంలో ప్రవేశించినకొద్దీ ఆర్థికంగా వెనుక బడ్డ కుటుంబాలకు వేణ్ణీళ్ళకు చన్నీళ్ళ లాగా సహాయకారులవుతున్నారు. అవివాహితులుగా ఉన్న బాలికలను ఉద్యోగాలలో జేర్చిన కుటుంబాలకు

కొంత లాభం కలుగుతోంది. వారి వివాహ ఖర్చుల కయినా సహాయం లభిస్తోంది.

స్త్రీ ఉద్యోగినులకు మరొక క్లిష్టసమస్యకూడ ఉంది. విరుద్ధ భావాలున్న వారితో కలిసి పనిచేయవలసి వస్తుంది. అది నిజానికి అసాధారణ పరిస్థితి అనే చెప్పవచ్చు. ప్రాచీన ఆచార సాంప్రదాయాల ననుసరించి స్త్రీ భార్యగా, తల్లిగా తన బాధ్యతలను నిర్వహించడంలో సంపూర్ణంగా తన్ను తాను ఆ బాధ్యతా నిర్వహణకు అర్పించుకోవలసి వస్తుంది. అంటే అంకిత పరచుకోవడమన్న మాట. అందుకు ప్రధానంగా కావలసింది స్వార్థ త్యాగం. దీనివల్ల ఆమెకు ఆఫీసులో బాధ్యతలను ఆదర్శంగా నిర్వహించడంతోపాటు ఇంట్లో ప్రాచీన స్త్రీకి ప్రతిబింబంగా నిర్వహించవలసి వస్తుంది. అందువల్ల సంసారంలో నిరంతరం ఇతరులకు ఏరూపంలోనయినా ఇవ్వడంతోనే గడపవలసి వస్తుంది. అలా గడిపే స్త్రీకి ఆమె పాత్రను అభ్యుదయకరమయిన రీతిలో నిర్వహించడానికి కుటుంబ సభ్యులు ఇసమంతకూడ సాయపడరు. అనగా ఆమె స్వవిషయం స్వీయ అవసరాలకు ఏ మాత్రం పాత్ర ఉండదు. ఇలాంటి వ్యతిరేక భావోద్రేకాలలో ఆమె కలిసి జీవించవలసి వస్తుంది. అలాంటప్పుడు మానసిక ఒత్తిళ్ళు కలగడం సహజం గదా! అలాంటి వత్తిళ్ళు పెరగడంవల్ల రాను రాను పురుషులతో కలిసి పనిచేయగల స్త్రీల నిష్పత్తి దశాబ్దానికి కొంత తగ్గుతోంది. డాక్టరు ప్రమీలా కపూర్ ఉద్యోగాలలో ఉన్న స్త్రీల పరిస్థిలను పరిశీలించిన పరిశోధనలలో 86 శాతం భర్తలు భార్యలు ఉద్యోగాలు చేయడానికి అనుకూలురుగానే ఉన్నారన్న విషయం స్పష్టమవుతోంది. మరికొన్ని కేసుల్లో 50 నుంచి 70 శాతం వరకు భర్తలు భార్యలు ఉద్యోగాలు చేయడానికి అనుకూలురుగా కనబడ్డారు. 40 నుంచి 90 శాతం వరకు తలిదండ్రులు కూడ బాలికలు ఉద్యోగాలు చేయడానికి అనుకూలంగా ఉన్నట్లు కనబడుతుంది. అత్త మామలు, తాత ముత్తాతలు కూడ అనుకూలంగానే కనబడుతున్నారు.

పెద్దల అంగీకారంవల్ల ఒక వత్తిడి తొలగినప్పటికీ మరికొన్ని ఒత్తిళ్ళు వారికి లేకపోలేదు. కుటుంబాలలో స్వవిషయాల్లో మనసు కష్టం కలిగినపుడు అత్తగారు, భర్త ఆమెను నిర్లక్ష్యం చేయడం సాధారణమయి పోయింది. అందుకామె చేసే తప్పంతా ఉద్యోగ బాధ్యతల్లో లీనమయిపోయి నిర్వహించడమే. అలాంటి సమయాల్లో కొన్ని గృహకృత్యాలు నిర్వహించ డానికి కావలసిన సమయం సన్నగిల్లిపోవచ్చు. ఆ సమయాల్లో వాళ్ళదగ్గర నుంచి సానుభూతి పొందలేకపోవడంతోపాటు తప్పులు పట్టే ధోరణి ఆమె కెదురవుతుంది. ఆ ధోరణి ఆమె ననేక విధాలయిన మానసిక ఒత్తిళ్ళకు గురిచేస్తుంది. వాటివల్ల ఆమెకు మానసికంగా కొంత అశాంతి ఏర్పడు తుంది. అలాంటి వాతావరణాన్ని ఆసరాగా తీసికొని పిల్లలుకూడ వారి ప్రవర్తనలతో తల్లి మనసు నుద్రేకపరుస్తారు. గృహకృత్యాల్లో తగినంత బాధ్యత, శ్రద్ధ చూపడంలేదన్న భావం కలగడంతో వారి ప్రవర్తనలో మార్పు వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో తక్కిన కుటుంబ సభ్యుల సానుభూతి, సహకారాలుంటేగాని సమస్య పరిష్కరించబడడానికి వీలులేదు. అవి లేని నాడు కుటుంబంలో ఆమె ఒక రకమయిన ఒంటరితనాన్ని అనుభవించవలసి వస్తుంది. కుటుంబాన్ని తృప్తి పరచాలంటే ఉద్యోగ బాధ్యతలనయినా నిర్లక్ష్యం చేయాలి. లేక తనను గురించి పూర్తిగా నిర్లక్ష్యం చేయనయినా చేసికోవాలి. ఉద్యోగంలో సంపాదించే జీతానికి న్యాయం చేయాలని ప్రయత్నిస్తే కుటుంబ సభ్యులను బాధించవలసి వస్తుంది.

ఇలాంటి మానసిక ఒత్తిళ్ళు మగవారి కెన్నడూ కలుగవు. సంపా దించే హక్కు వారికుందని సమాజంలో అనాదిగా వస్తూవున్న భావం. అందుచేత సంపాదించడానికి బయటకు వెళ్ళడం వారికి గౌరవాస్పదం. కాని స్త్రీలకు విముక్తి లభించిందని ఎంతగా చెపుతున్నప్పటికీ స్త్రీ కుటుంబంలో మునిగి ఉండాలన్న ఆచారంవల్ల బయటకు ఉద్యోగాలకు వెళ్ళేవారికి అనేక

బాధలు కలుగుతున్నాయి. జాతి శ్రమలో స్త్రీలు కూడ ఒక భాగమయినపుడు గాని దేశంలో ఈ బాధలు లేని స్థితి ఉండదు.

వాస్తవానికి గత్యంతరం లేకపోవడంవల్లగాని స్త్రీలు గృహకృత్యాల్లోనే లీనమయి గడపాలని కోరుకొంటారు. స్వయంగా వంటా వార్పులు చేసికోవాలనీ, స్వయంగానే ఊడ్చి, కడిగి ఇల్లు శుభ్రపరచుకోవాలనీ వారెంతగానో వాంచిస్తారు. ఆఫీసు విధులు నిర్వహించడానికంటె గృహకృత్యాలలో అమితానందాన్నను భవిస్తారు. అయితే విధి నిర్వహణకోసం పనులు చేయవలసి వస్తుంది ఆఫీసుల్లో. ఆఫీసుల్లో కూడ పనిలో వచ్చే పోటీలు, అయాచితంగా ఆఫీసర్ల ఆదరాభిమానాలు కొందరిపై ప్రసరించేటపుడు సహోద్యోగినుల్లో వచ్చే బేధాభిప్రాయాలు, కావాలని వారికిబ్బంది కలిగించే కొందరి స్వభావాలు, వీటన్నిటివల్ల ఉద్యోగాలు చేసేవారిమీద ఇళ్ళల్లో ఉండేవారి అవహేళనలు, నిందా ప్రచారాలు-మరొక వంక నుంచి ఆ స్త్రీలను క్రుంగదీస్తాయి. వీటన్నిటిని తట్టుకోలేక కొందరు ఉద్యోగాలను త్యజించే పరిస్థితులు కూడ రావడం కద్దు. ఐనా వీటన్నిటిని తట్టుకొని పరిస్థితుల కనుగుణంగా సమయస్ఫూర్తిని ప్రదర్శించి, సమర్థతతో నిర్వహించేవారు అసంఖ్యాకంగా ఉన్నారు. విధి నిర్వహణలో ఆనందాన్నను భవించే వారుకూడ అనేకమంది ఉన్నారు. ఒక రంగంలో తను శక్తియుక్తులను ప్రదర్శించి నిర్వహించడంవల్ల తమ సృజనాత్మక కార్యకలాపాలను సమర్థవంతంగా చేయగలుగుతూ ఫలితాలను చూచి తృప్తి ననుభవించేవారు కూడ ఆ ఉద్యోగాలు చేసేవారిలో అధిక సంఖ్యాకు లున్నారు. అలాంటివాళ్ళు కుటుంబ జీవనంలో కూడ సమయాన్ని సంపాదించి సుఖసంతోషాల నర్థిఞ్చుకొని అనుభవిస్తారు.

ఐనప్పటికీ ఈనాడు ఆడపిల్లలకు ట్రైనింగు సీట్లు కావాలనీ, ఇతర ఉద్యోగాలు కావాలనీ రాజకీయ నాయకుల ప్రాపు కోరే వారనేకమంది ఉన్నారు.

సాధారణంగా వివాహానికి ముందు ఆడపిల్లలు ఉద్యోగాలుచేయడం, వివాహానంతరం కూడ మళ్లీ అవే చేయడమో వేరొక చోటకు వెళ్లినపుడు తిరిగి ప్రయత్నించడమో కనబడుతుంది. తరచు ఉపాధ్యాయినులుగా, సంక్షేమ కార్యాలయాలలో రిసెప్షనిస్టులుగా, టెలిఫోను ఆపరేటర్లుగా, ఆఫీసుల్లో గుమాస్తాలుగా, టైపిస్టులుగా, స్త్రీలు పనిచేస్తున్నారు. ఇటీవల బాంకుల్లోను, పోస్టు ఆఫీసుల్లో కూడ స్త్రీలు అధిక సంఖ్యలో పని చేస్తున్నారు. ఇంకా సినిమా హాలులో టిక్కెట్లమ్మే పనిలో మాత్రం మహిళలు కనబడడంలేదు. ఇటీవల కానిస్టేబిల్స్‌గా కూడ స్త్రీలు పనిచేస్తున్నారు.

ఇలా అనేక రంగాలలో స్త్రీలు ప్రవేశించి పనిచేస్తున్నారు. ఏకారణం వల్లనోగాని 1963 లో నైపుణ్యంలేని స్త్రీ కార్మికుల సంఖ్య పడిపోయింది. అడ్మినిస్ట్రేటివ్, ఎక్సిక్యూటివ్ రంగాలలోను, మేనేజరియల్ సర్వీసుల్లోను 1960 నాటికి 10,000 మంది ఉండగా తరువాత వారి సంఖ్య 12,000 వరకు పెరిగింది. అలాగే గుమాస్తాలు మొదలయిన వాటిలో 37,000 నుంచి ఎనిమిది సంవత్సరాలలో 79000 కు పెరిగింది. రవాణా కమ్యూనికేషన్ శాఖల్లో స్త్రీ ఉద్యోగినుల సంఖ్య స్థిరంగా నిలిచిపోయింది. కాని స్పోర్ట్సు, రిక్రియేషన్‌లో 1960 నాటికి 5000 మంది ఉండగా 1968 నాటికి 13,000 మందికి పెరిగారు. నైపుణ్యంలేని కార్మిక రంగంలో 1960 లో 25,000 మంది కాగా 1968 నాటికి 16,000 కు పడిపోయింది. బహుశః ఆ కార్మికులు కూడ పై ఉద్యోగాలు సంపాదించడంవల్లగాని లేక అలాంటి రంగాల్లోకి వెళ్ళడంవల్లగాని ఆ మార్పు జరిగి ఉండవచ్చు. ఇటీవల కాలంలో అనేకమంది స్త్రీలు లాభదాయకంగా ఉండే అనేక కార్యకలాపాలల్లో నిమగ్నులవుతున్నారు. వీటిని లెఖ్ఖల్లో సరిగా చూపి ఉండకపోవచ్చు.

భారత దేశంలో పన్నుల విధానంకూడ స్త్రీలపట్ల కొంత ఉదారంగానే వుందని చెప్పాలి. స్త్రీలల్లో అనేకమంది ఆదాయపు పన్ను పరిధిలోకి రానే

రారు. సంవత్సరానికి 10,000 రూపాయలు ఆదాయం గలవారికి పన్ను ప్రారంభమవుతుంది. ప్రత్యేకంగా సంపాదించే స్త్రీలుకూడ వారి భర్తలతో కలిసి కాక ప్రత్యేకంగా వారి సంపాదనపై మాత్రం పన్ను వుంటుంది. అయిదారు సంవత్సరాలకు పూర్వం స్త్రీల సంపాదన పురుషులతో కలిపి పన్ను విధించదలచింది ప్రభుత్వం. కాని మహిళా సమాజాల నుంచి పెద్ద ఎత్తున వ్యతిరేకత వచ్చింది. అందువల్ల పన్నుల చట్టంలో స్త్రీల కను కూలంగా మార్చుకోగలిగారు. వివాహ చట్టం మాత్రం వారిద్దరికీ ఒకే మాదిరిగా వుండగా పన్నుల చట్టం మాత్రం వారిద్దరికీ ఒకేమాదిరిగా ఎందు కుండగూడదు ? అని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి అనాడు ప్రశ్నించారు. కాని దానిపట్ల ప్రోత్సాహాన్ని ప్రదర్శించకపోవడంవల్ల ఆ యభిప్రాయాన్నామె వదిలివేశారు. ఆధునిక వ్యవసాయ క్షేత్రాలను కలిగియున్న స్త్రీలు అనేక మంది వివాహితులుగానే వున్నారు. వారికి న్యాయశాస్త్రం, చట్టం, పన్నులు విధించడంలో అనుకూలంగానే వున్నాయి. అందువల్ల ఆర్థికంగా, న్యాయ శాస్త్ర రీత్యాకూడ పరిస్థితులు స్త్రీలకు పురుషులతో అనుకూలంగా వున్నా యనడం మాత్రం నిర్వివాదం.

వర్తమాన పరిస్థితి నిష్పటపరకు రేఖామాత్రంగా పరిశీలించాంఅయితే మనం చూచిన పరిస్థితుల నుంచే గమనింపవలసిన గ్రహించవలసిన విషయా లేవి ?

వివిధ రంగాల్లో ప్రవేశించి విధులను నిర్వహిస్తున్న స్త్రీలను చూస్తు న్నాం. ఐ. ఎ. ఎస్, ఐ. యఫ్. యస్ ల్లాగ ఇతర ప్రధానమయిన రంగాల్లో ప్రధానమయిన పాత్రల్లో కొంతమందికి ఉద్యోగాలు లభించడంవల్ల స్త్రీలకు విరివిగా లభిస్తున్నట్లుగా గణిస్తే అది కేవలం పొరపాటు అంచనా అవు తుంది అంతేకాదు దానితోపాటు మరో పొరపాటు కూడ జరిగే అవకాశం లేకపోలేదు. పురుషుల ఉద్యోగాలకు స్త్రీలు పోటీ వస్తున్నారన్న అపోహ

అధికమయిపోయింది. అయితే మహిళల ఉద్యోగాలమీద చేసిన పరిశీలన విభూత్న విషయాలను వెల్లడించింది. క్రమంగా ఉద్యోగినుల సంఖ్య భారత దేశంలో పడిపోతోందన్నదే ఆ విసూత్న విషయం. ఉద్యోగాల్లోనే గాక జనాభాలో కూడ స్త్రీల సంఖ్య శాతం తగ్గు మార్గం పట్టిందన్నది మరో నూత్న విషయం.

ఉద్యోగాల్లో స్త్రీల సంఖ్య తగ్గిపోవడం సమాజం యొక్క సర్వతో ముఖాభివృద్ధికి కొంత అవరోధం కలగడమే. దానితోపాటు సమాజంలో స్త్రీల స్థానంకూడ బలహీనపడుతోంది. 1921 నుంచీ 1971 వరకు సుమారొక అర్థ శతాబ్దంపాటు దేశం మొత్తం శ్రమశక్తిలో స్త్రీలు సగమయినప్పటికీ ఏదో ఒక జీవనోపాధి కలిగినవారు మాత్రం చాల తక్కువని తేలింది. భారతీయ సాంఘిక విజ్ఞాన పరిశోధనా సంస్థ ఇటీవల ప్రకటించిన నివేదిక వల్ల ఉపాధి కల్పనావకాశాలు క్షీణించడంవల్ల అనారోగ్య మేర్పడిందని తన్మూలంగానే స్త్రీల్లో నిరుద్యోగుల సంఖ్య తగ్గుతూవచ్చిందని తెలుస్తోంది. పరిపాలనా వ్యవహారాలు, వ్యవసాయ పరిశ్రమకు సంబంధించిన వ్యవహారాల్లో స్త్రీలకు ఉద్యోగాలు తగ్గినట్లుగా భారతీయ సాంఘిక విజ్ఞాన పరిశోధనా సంస్థ ప్రకటించింది. స్వాతంత్ర్యానంతరం అలాంటి అవకాశాలు మహిళలకు లభించాయి. కిందిస్థాయికి చెందిన మహిళలకు విద్యావకాశాలు, శిక్షణ పొందే అవకాశాలు లేకపోవడంవల్ల నిమ్నజాతి మహిళల స్థితి అథమ స్థాయికి దిగజారడంతోపాటు మొత్తం జనాభాలోనే మహిళల శాతం క్రమంగా తగ్గుతూ వస్తోంది. కారణమాలోచిస్తే స్త్రీలల్లో 'పిల్లగండం' ఇంకా ఉండడం కనబడుతుంది. ప్రసూతి శిశుపోషణ విషయంలో పొరుగున ఉన్న సింహళం కూడ పురోగమించిందన్న విషయం స్పష్టంగా తెలుస్తోంది. మనదేశంలో లక్ష ప్రసవాలల్లో 573 మంది పిల్లలు మరణిస్తూ ఉండగా సింహళంలో 200 మంది మాత్రమే మరణిస్తోన్న విషయాన్ని పరిశీలిస్తే మనదేశంలో ప్రసూతి సౌకర్యాలెంత అథమస్థాయిలో ఉన్నాయో స్పష్ట

పడుతుంది. మన వైద్యశాలల్లో 100 కి 17 పడకలు మాత్రమే ప్రసూతి కేసులకు కేటాయిస్తారు.



స్త్రీల ఉద్యోగాలు క్రమంగా తగ్గిపోవడం స్త్రీ ఉద్యోగుల సంఖ్య క్రమంగా తగ్గిపోవడానికి కారణమేమిటి? 1911 లో ప్రతి వేయిమందికి 525 మంది స్త్రీలుండేవారు. 1952 నాటికి ఆ సంఖ్య 408 కి పడిపోయింది. 1951 నుంచి 1971 నాటికి అంటే రెండు దశాబ్దాల్లో 210కి పడిపోయింది. స్వాతంత్ర్యానంతరం వివిధ రంగాల్లో పనిచేసే స్త్రీల సంఖ్య క్రమంగా పై విధంగా తగ్గుతూ వచ్చింది. వ్యవసాయ రంగంలో పనిచేసే మహిళల సంఖ్యకూడ 31 కోట్లనుంచి 25 కోట్లల్లోకి వచ్చింది. అయితే పురుషుల సంఖ్య 34 కోట్లను మించింది. వ్యవసాయేతర రంగాలలో పని చేసే మహిళల సంఖ్య 98 లక్షల నుంచి 62 లక్షలకు పడిపోయింది. అదే సమయంలో, అదే రంగాలలో పురుషుల సంఖ్య 33 కోట్ల నుంచి 48 కోట్లకు పెరిగింది. మొత్తంమీద ఆ కాలంలో పనులలో పురుషుల శాతం 27 పెరిగితే పనులలో స్త్రీల శాతం 12కు తగ్గిపోయింది.



పరిస్థితుల్ని గమనించి ప్రభుత్వం మహిళల పరిసితిని మళ్లీ 1960 నాటిలా చేయాలని చూస్తుంది. అంటే ఆనాడు పనిచేసే వారి శాతం 25 మళ్లీ ఆ స్థితిని అందుకోవాలని ప్రయత్నంచేయటమే అది పెద్దదికూడాకాదు.



ప్రస్తుతం ప్రభుత్వం గ్రామీణ ఉపాధి కల్పనా కార్యక్రమాన్ని తల పెట్టింది. ధానికి పెట్టే పెట్టుబడిలో నుండి 25 శాతం మహిళల కుపయోగ పడేలా వుపాధి కార్యక్రమాలకు మరలించి, మొత్తం వుద్యోగాల్లో స్త్రీలకు తగినంత శాతాన్ని ప్రత్యేకించితే కొంతవరకూ వుపయోగుపడుతుంది. కేవలం కుట్లు అల్లికలే కాకుండా మహిళాభ్యుదయానికి అనేక ఇతర వుత్పత్తి

రంగాల్లో వారికి శిక్షణ నీయాలి. అలాంటి శిక్షణా కేంద్రాల్ని పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ నెలకొల్పాలి.

ఇటీవల మహిళల నిరుద్యోగ సమస్యని పరిష్కరించడానికి కావలసిన సూచన లివ్వడానికి ఒక పరిశోధనాధ్యయన బృందాన్ని ప్రణాళికా సంఘం నియమించింది. ఈ బృందంలో శ్రీ రామకృష్ణ మహిళలకు ఉద్యోగాలు కల్పించే విషయంలో చాలా పట్టుదలగా ఉన్నారు. ఇది ముదావహం. స్త్రీలకు ఉద్యోగాలు కల్పించకుండా, స్త్రీ సంక్షేమని చెప్పడం కేవలం నీటి మూట అని ఆయన అభిప్రాయం స్త్రీలు అత్యధిక సంఖ్యలో పాల్గొనడానికి అవకాశాలు కల్పించడానికి ప్రణాళికా సంఘం తీవ్రంగా ఆలోచిస్తుంది.

ఉత్పత్తి కార్యక్రమాల్లోనూ, సేవా కార్యక్రమాల్లోనూ, ప్రత్యేకంగా స్త్రీల నుపయోగించడం మన ప్రగతిని పెంపొందించడంతోపాటు మహిళల దుస్థితినికూడ క్రమంగా దూరం చేయవచ్చు. దేశ జనాభాలో సగభాగమైన స్త్రీలు సర్వరంగాల్లో పురుషులకు అండదండగా నిలబడగలిగినపుడే దేశంలో సర్వతోముఖాభివృద్ధి సత్వరంగా సాగే అవకాశముంటుంది.



1945లో ఆంధ్రా యూనివర్శిటీలో బి.ఏ.డిగ్రీ. 1947లో బి.ఇడి డిగ్రీ. 1972లో ఎం.ఏ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

7 సంవత్సరాలు నెల్లూరు కస్తూరిదేవి హైస్కూలులో ఉపాధ్యాయినిగా పని చేసిన అనంతరం, విజయవాడ వచ్చి మాంటిసోరి స్కూలు ఆధిపత్య బాధ్యతలు స్వీకరించి, 16 సంవత్సరాల కాలంలో దానినొక మహాసంస్థగా రూపొందించారు. ప్రస్తుతం మాంటిసోరి స్కూళ్ళ కరస్పాండెంటుగానూ, మాంటిసోరి మహిళా కళాశాల ప్రిన్సిపాల్‌గానూ, కరస్పాండెంటుగానూ పనిచేస్తున్నారు. విద్యాలయాన్ని సర్వతోముఖంగా తీర్చిదిద్దాలన్నది ధ్యేయం.



శ్రీమతి వి. కోటీశ్వరమ్మ
M.A., Ph.D., B.Ed.,

సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డు సభ్యులుగా పనిచేశారు. 1971లో రాష్ట్రంలో ఉత్తమ ఉపాధ్యాయినిగా జాతీయ అవార్డుపొంది, ఆ మరుసటి సంవత్సరం ఆ అవార్డును నిర్ణయించే కమిటీ సభ్యులుగా పనిచేశారు.

బాల నేరస్థుల గౌరవ మేజిస్ట్రేటుగా భారత మహిళామండలి అధ్యక్షురాలుగా, జిల్లా గైడ్స్ స్కౌట్సు ఉపాధ్యక్షురాలిగా, దక్షిణమధ్య రైల్వే వినియోగదార్ల బోర్డు సభ్యురాలుగాను పనిచేశారు. జీవిత భీమా కార్పొరేషన్ పాలసీదారుల కౌన్సిల్ సభ్యులుగా ఉన్నారు. ఇటీవలనే ఆంధ్రప్రదేశ్ మహిళా విద్య సంఘ సభ్యులుగా నియమింపబడ్డారు. ''లూయీపాశ్చర్'' జీవిత చరిత్ర, ''భారతదేశంలో స్త్రీ విద్య'' ''పిల్లలు మంచీ-చెడూ'' ''ఇందిరా సంజయ్‌లు''వీరి ముద్రిత గ్రంథాలు.

నాగార్జునా యూనివర్శిటీ సెనెట్ మెంబరుగా పనిచేశారు. ప్రస్తుతం ఎకడమిక్ కౌన్సిల్ మెంబరుగా ఉన్నారు. వీరి ''సంఘ సంస్కరణ-వీరేశలింగ సాహిత్యం'' అనే అంశంమీద పరిశోధనా వ్యాసానికి నాగార్జునా యూనివర్శిటీవారు Ph.D. ఇచ్చారు. 1980-81 సంవత్సరం ఉత్తమ కళాశాల, విశ్వవిద్యాలయం అధ్యాపకురాలిగా రాష్ట్రప్రభుత్వం అవార్డు ఇచ్చింది.